



# ప్రజాయుద్ధం

# ప్రజా యుద్ధం

రచన :

కలినిన్

అనుసరణ :

పరుచూరి రామకోటయ్య

సంస్కృతి గ్రంథమండలి

వంగల్ బిల్డింగ్స్, :: పెరంబూరు పోస్టు,

మద్రాసు.

ప్రచురణ — 12

ప్రథమ ముద్రణం.

వెల ఆరణాలు

ఫిబ్రవరి, 1944.

సంపాదకులు :

కస్తూరి సూర్యప్రకాశరావు,

కొత్తపల్లి సుబ్బరామయ్య,

మేనేజరు :

వంగల్ గోవిందస్వామి రెడ్డి,

3 NPR01D287

# మా మాట

ఈ రచనను మిత్రులు కామ్రేడ్ పరుచూరి రామకోటయ్యగారు చాలరోజులక్రితమే అనువదించి మాకు పంపారు. కాగితం దొరకక కొంతకాలం, కాగితం దొరికినతర్వాత ముద్రింప తగిన ముద్రణాలయం దొరకక కొంతకాలం ఏలాగైతేనేం ఆరునెలలకు పైగా ఆలస్యం చేసాం. అనుసరణను వ్రాసియిచ్చిన మిత్రులు, పాఠకలోకంగూడా ఈ ఆలస్యానికి మమ్మ క్షమింతురుగాక.

పాఠకు లనేకులు ఒకటి, రెండు ప్రచురణలను వి. పి. లకు పంపమని వ్రాశారు. ఒక్క రూపాయ చేయని ప్రచురణలను వి. పి. పి. లకు పంపి వారిచే షుమారు 0-8-0 దండగ పెట్టించడం మా కిష్టంలేక పంపలేదు. అట్టివారు గ్రహింతురుగాక. పాఠకులనేకులు కార్డులు వ్రాశారు—అనవసర విషయాలగురించి. రిప్లయి కార్డులు వ్రాసినగాని ప్రత్యుత్తరములివ్వలేము.

పెరంబూరు సంపాదకులు.

24—2—44

4



రచయిత



ఈ రచన రష్యను భాషలో 1941 డిసెంబరు ఆఖరులో వ్రాయబడింది. ఆంగ్లంలో. "పేట్రియాటిక్ వార్" అన్నపేర ఆగస్టు 1942 న బొంబాయినగరంలోని పీపిల్స్ పబ్లిషింగ్‌హౌస్ వారిచే ప్రచురింపబడినది.

# 1. యుద్ధ మెలా ఆరంభమయింది?

1941 జూన్ 22 వ తేదీ వుదయం గం॥ 5-30 నిమిషములకు జర్మను రాయబారి వాండర్ స్కూలెన్‌బర్గు కామ్రేడ్ మాలటావ్‌కు జర్మను ప్రభుత్వం సోవియట్ యూనియన్‌పై యుద్ధం ప్రకటించిందని తెలియజేశాడు. నిజానికి అంతకుముందు రెండుగంటలనుండే మన సరిహద్దులను దాటివచ్చిన జర్మను సేనలకూ, మన సేనలకూ పోరాటం జరుగుతూవుంది. శాంతి ననుభవిస్తూ పొలిమేరలన గాక లోనున్న మన పట్టణాలలో అప్పటికే జర్మను విమానాలు బాంబులు వేశాయి.

ఆనాడే మధ్యాహ్నం పద్రెండు గంటలకు సోవియట్ ప్రభుత్వం తరఫున ఫాసిస్టు జర్మనీ మనదేశంపై దురాక్రమణ జరిపిందని రేడియోద్వారా కామ్రేడ్ మాలటావ్ తెలియపరచాడు. అంతిమ విజయం లభించేంతవరకూ పోరాడవలసిందిగా యెఱ్ఱ సైన్యాన్నీ, సోవియట్ ప్రజనూ ఆజ్ఞాపించాడు. ఈ విధంగా ఫాసిస్టు దురాక్రమణదారులకు వ్యతిరేకంగా మన ప్రజాయుద్ధం—మన ధర్మయుద్ధం ఆరంభమయింది.

ఇంతవరకు మనం జర్మనీతో మూడు పర్యాయాలు యుద్ధం చేసివున్నాం. క్రీ॥ వె॥ 1242 లో మనదేశంపై దాడివెడలిన జర్మన్ చక్రవర్తులను సికావ్‌వద్ద అలెగ్జాండరు నెవిస్కీ ఓడించివేశాడు. 1759 లో కునెర్సుడార్ఫు వద్ద మన సైన్యాలు రెండవ ఫ్రెడెరిక్ సైన్యాన్ని ఓడించి, 1760 లో బెర్లిన్ను ప్రవేశించాయి. ఇప్పటికీ మన మ్యూజియాలలో ఒకదానిలో అప్పటి బెర్లిను నగరం తాళాలను చూడవచ్చును. ఇక మూడవదైన 1914—18 యుద్ధము, దాని ఫలితాలనుగూర్చి మనకు బాగా తెలుసు.

ప్రథమ సామ్రాజ్యవాద యుద్ధం (ప్రపంచయుద్ధం) జరిగి యిప్పటికి 24 గేండ్లయినప్పటికీ నాటి యుద్ధానికీ, నేడు మనం జర్మనీతో జరిపే యుద్ధానికీ పోలికేలేదు. యుద్ధ పద్ధతులలో ఎంతో మార్పువచ్చింది. అంతేకాక మన ప్రజలందరికీ యీ యుద్ధ పర్యవసానంవలన మున్నెన్నడూలేని అతి ప్రమాదకరమైన రాజకీయ ఆశయాల భగ్నత కలుగవచ్చు.

గత యుద్ధం (1914—18) దురాక్రమణకే అయినా, రక్త స్పర్శగల రెండువంశాలమధ్య జరిగింది. నికొలస్—విల్ హెల్మ్ అనే బంధువులమధ్యనే ఆ యుద్ధం జరిగింది. వారు పరస్పరం "ప్రియమైన సోదరా" అని వుత్తరాలు వ్రాసుకుంటూండేవారు. ఈ సోదరులు తమ హోదానుబట్టీ, శక్తినిబట్టీ, ఒకరి ఆస్తిని మరొకరు కబళింపచూచారు. యుద్ధాన్ని సాగించడంలో, మర్యాద కొరకైనా, అంతర్జాతీయ నీతిసూత్రాలను పాటించారు. ఖైదీలుగా చిక్కిన సైనికోద్యోగులను యిరుపక్షాలవారూ గౌరవించారు. సామాన్య యుద్ధఖైదీలుగూడా సైనికోద్యోగులంత గౌరవము పొందక పోయినప్పటికీ, కనీసం బహిరంగంగానూ, అధికారరీత్యానూ, జెయిల్లో వుంచబడేవారుకారు. ఖైదీలను తుపాకులతో కాల్చి చంపడం, చిత్రవధచేయడం చాలా అరుదుగా జరిగేది. అక్కడక్కడ జర్మను సైనికులు పౌరులను దోచుకుంటూ హింసించినప్పటికీ అధికారులు వూరుకునేవారు కారు. అలా హింసించిన సైనికులను దండించేవారు కూడాను.

కాని నేడు మనపై జరుగుచున్నది హిట్లరు యుద్ధం. దీనిని రాక్షస యుద్ధమనాలి. తానే చొరవతీసుకొని యుద్ధమారంభించుతావనీ, తానుకొట్టే ప్రతిదెబ్బ తన విరోధి సైన్యానికి సుత్తిదెబ్బవలె తగులుతుందనీ, తానాక్రమించిన ప్రదేశంలోనుంచి సర్వనాశనం గా

వించుతూ, కత్తిచేబూని ముందుకు కదలిపోతాననీ హిట్లరు ప్రకటించాడు. ఆక్రమిత దేశాల ప్రజలను, నల్లులవలె నలిపివేయాలన్నదే హిట్లరాశయం. ఇది కేవలం వూహామాత్రమే కాదు. ఈ క్రింది విధంగా హిట్లరే చెప్పాడు—"అతి విస్తారంగా బాంబుచేయడం, తలవని తలంపుగా దెబ్బకొట్టడం, అతి క్రూరనిర్బంధ విధానాన్ని అమలు జరపడం, శత్రురక్షణంలో నీరసంగా వున్నచోట అదురు దెబ్బ కొట్టి శత్రువును కంగారుపరచడం—యిదే ముందు జరిగే యుద్ధం. ఏమైనాసరే సర్వనాశనంచేస్తాను. వ్యూహాలుపన్నేవారిపై నేనేమీ ఆధారపడను. యుద్ధాన్ని కొనసాగించేది నేనే. దాడిచేయడానికి సరియైన అదును చిక్కిన ఆ అవకాశాన్ని యేమాత్రం జారవిడువను. అలాంటి అదును చిక్కినపిదప ప్రతి యువకుని ఆ మారణహోమంలోకి పంపుటకు నాకు సర్వాధికారంవుంది. ఇదే నా కర్తవ్యం."

ఇప్పటికి జర్మనీతోటి యుద్ధంలో కొంత అనుభవం గడించాము మనం. 1941 జూలై 3 న కామ్రేడ్ స్టాలిన్ తన రేడియో వుపన్యాసంలో, జర్మను నేషనల్‌సోషలిస్టు (జాతీయసామ్యవాదులు) లంటే యిచ్చిన నిర్వచనంలోని సత్యాన్ని బోధపరచుకున్నాం. జర్మనీఫాసిస్టు నాయకులంటే నరహంతకులేనని కామ్రేడ్ స్టాలిన్ అన్నాడు. నిజంగా వీరు మానవులను భక్షించే రాక్షసులు కారా ? గత చరిత్రలో యెచ్చటా కనుపించని రాక్షసకృత్యాలే వీరి సాహస చర్యలు.

---

# 2. హిట్లరు ముఠా యెలాంటిది?

## ఫాసిజంను బలపరచేదెవరు?

శత్రువును ఓడించాలంటే ఆత డెలాంటివాడో మొదట తెలుసుకోవాలి. జర్మనీలోని నేటి ప్రభుత్వం దేన్ని నిరూపిస్తూంది? అది యేయే శక్తులపై ఆధారపడివుంది?

జర్మనీలో నేడున్నది ఫాసిస్టు ప్రభుత్వం. "నేషనల్ సోషలిస్టులం" (జాతీయ సామ్యవాదులం) అని యీ ప్రభుత్వాన్ని బలపరచేవారు పిలుచుకుంటున్నారు. సోషలిస్టు అన్నపదాన్ని యెరగా చేసి కార్మిక వర్గాన్ని ధ్వంసంచేయాలని వారియెత్తు. ఒక రాచకీయ పార్టీగా ఫాసిస్టు పార్టీ గడచిన యుద్ధానంతరం బయలుదేరింది. 1921 లో ఫాసిస్టుపార్టీ ప్రప్రథమంగా ఇటలీలో రాజకీయంగా ముందుకు వచ్చింది. ఆ సమయంలో ఇటలీ అంతటా బ్రహ్మాండమైన సమ్మెలు వ్యాపించి యంత్రాగారాలన్నిటినీ కార్మికులు స్వాధీనంచేసుకునే విప్లవ పరిస్థితి యేర్పడింది. అప్పటి ప్రభుత్వం యీ విప్లవపరిస్థితిని యెదుర్కొ-లేకపోయింది. పెట్టుబడిదారులంతా భయపడిపోయారు. కాని ఇటలీ కార్మికవర్గం మన బోల్షివిక్కు-పార్టీలాంటి నాయకత్వాన్ని కలిగియుండనందున వారి విప్లవోద్యమం ఒకే కేంద్రీకృత రాచకీయ కార్యక్రమంగా సంఘటిత పరచబడ లేదు. ఆ కారణంగా కార్మికుల ఓటమి తప్పిందికాదు.

అలాంటి రోజుల్లో, విప్లవ పిశాచాన్ని చూచి హడలిపోయిన ధనికవర్గాల సాయంతో "సోషలిస్టు" అయిన ముసోలినీ తన పార్టీని చక్క-బరచి సైనిక శిక్షణాన్ని యిచ్చాడు. ప్రభుత్వ సైన్యంలోని ఒక రెజిమెంటుచే ఓడింపనగు యీ దళంతో 1922 లో "రోమ్" నగరంమీదికి దాడి వెడలి అధికారాన్ని గుంజుకున్నాడు. ముసోలినీ ఫాసీజంను కనిపెట్టింది తానే అని యిప్పటికీ మురిసిపోతున్నాడు.

సామ్రాజ్య యుద్ధానంతరం జర్మనీలోకూడ అదేవిధంగా తన అస్తిత్వాన్ని స్థిరపరచుకునేందుకు ధనికవర్గం ఫాసిస్టు ప్రభుత్వాన్ని యేర్పరచవలసి వచ్చింది. పెద్దపెద్ద పెట్టుబడిదార్ల ప్రతినిధులు ఫాసిస్టు పార్టీని నెలకొల్పడంలో నిద్రాహారాలు మానారు. ఈ పని లోనే నిమగ్నమైన బూర్జువావర్గం (మధ్యతరగతికిచెందిన ధనిక వర్గం) కూడా తన యితర పనులను మరచింది. హ్యూగెన్‌బర్గు లాంటి జాతీయవాదుల మూలంగా వారి కోర్కెలు, కార్యక్రమం బయటబడినవి. తమచేతులలో కీలుబొమ్మగా పనిచేసే సాయుధ దళమే యీ బూర్జువాలకు కొరతగా నుండేది. ప్రధమంలో నేషనల్ సోషలిస్టు మతాలలో యేదో సేవకుడుగావున్న హిట్లరు 1920 కి యీ సాయుధదళాన్ని క్రమపరచేనాయకుడుగా ముందుకువచ్చాడు. నాటినుండి హిట్లరు, జర్మను ప్రజలను అన్ని అరిష్టాలనుండీ కాపాడుతానని, ముఖ్యంగా వర్సెల్సు సంధి ప్రసాదించిన నరకాన్నుండి రక్షించుతానని అడ్డులేని ప్రచారం చేసుకోసాగాడు. కార్మికులకు తగు జీవితభృతి, రైతులకు భూమి, మేధావులకు అన్ని సౌకర్యాలు, వర్తకులకు అమిత లాభాలు—ఇలానే అందరికీ అన్ని ఆశలూ చూపాడు. మరొకవైపు "భయపడవద్దు. మీ సొత్తునేమీ అపహరించము సరిగదా ; యింకా అధికం చేస్తాము"—అంటూ పెట్టుబడిదార్ల చెవులలో వూదాడు.

పెట్టుబడిదారులూ, జమీందారులూ మంచిగా, అండగా వుండడంచేత కొద్దికాలంలోనే హిట్లరు పెటీబూర్జువాలనుండి, (మధ్యతరగతి ధనికవర్గం) యుద్ధానంతరం నిరుద్యోగంలో బాధపడుతూన్న సైనిక అధికారులనుండి, సైనికులనుండి ప్రజలను పోగుచేసి పెద్ద స్వచ్ఛందసైన్యాన్ని తయారుచేశాడు. లావాటి కండ రాలుపెరిగి, సోమరిపోతులుగావున్న వారే హిట్లరు గుమిగూర్చిన గుంపు. హిట్లరు పతాకంక్రిందికివచ్చిన వీరినందరిని అతడు బాగా

మేపాడు. ఏలాంటి ఘాతుకచర్యలు చేయడానికైనా వెనుదీయని వారిని వీరిలోనుంచి వేరుపరచి "స్టారం ట్రూప్స్" (తుపాన్ దళాలు) తయారు చేశాడు.

## ఫాసిస్టు ఆశయాలు

### 1. కార్మికుల నురితీయుట

ఫాసిజం అధికారంలోకి వచ్చేసరికి హిట్లరుయొక్క స్టారం ట్రూప్స్ రెండులక్షల సైన్యాన్ని, ప్రభుత్వం లక్షసైన్యాన్ని కలిగి వున్నవి. చట్టరీత్యా ఎలాంటి అధికారాలు లేనప్పటికీ, పెద్దపెద్ద ప్రభుత్వోద్యోగులలో, కొద్దిపాటి వుద్యోగస్థులలో కొందరియొక్క, పూర్తిగా పోలీసు లందరియొక్కసాయం అందగావున్న కారణం చేత జర్మనీలో ఫాసిస్టుల అధికారం అమలులోకి వచ్చింది. ఈ నూతన ప్రభుత్వం తనకు రాజకీయ శత్రువులగు కార్మిక నాయకులను నిర్దాక్షిణ్యంగా చంపివేసింది. కార్మిక సంఘాలపై దాడి, కార్మిక నాయకులను క్రూరంగా హింసించడం ఈ ప్రభుత్వానికి నిత్య కృత్యమయింది. అందుచేత క్రమేణా జర్మను పెట్టుబడిదారులు, సామ్రాజ్యవాదుల ముఠా అయిన హిట్లరు ముఠావల్ల కలిగే ఫలితాలను గ్రహించి యీ ఫాసిస్టు పార్టీని బలపరచారు.

గత యుద్ధానంతరం వర్సైల్సు సంధితో నక్కలపాలైన జర్మనీని పునరుద్ధరించి మరల గొప్ప సామ్రాజ్యంగా తయారుచేసి, ప్రపంచ సంపదనంతా కొల్లగొట్టి పగతీర్చుకోవాలని యీ ఫాసిస్టులు నిర్ణయించుకున్నారు. ఫాసిస్టుపార్టీయొక్క కార్యక్రమమే యీ వుద్దేశంతో నిర్ణయించబడింది. జమీనులను రద్దుచేయడం, పెట్టుబడిదారుల లాభాలకు కొంత హద్దు నేర్పరచడం మొదలగు అంశాలు సాధ్యమైనంత యెక్కువ ప్రజానీకాన్ని ఆకర్షించడానికే పార్టీ

కార్యక్రమంలో చేర్చబడినాయి. కడకు యీ వాగ్దానాలన్నీ కాగితం మీదే యినికిపోయినవి. ఎవరేది అడిగినా దాన్ని సమకూర్చుతామని చెప్పడంచేత మధ్యతరగతి ప్రజలు యీ పార్టీలో పూర్తిగా చేరారు. పార్టీ సభ్యత్వంకూడా హెచ్చింది. 1932 రీచ్‌స్టాగ్ (జర్మను ప్రజా ప్రతినిధిసభ) యెన్నికలలో యీ విషయం రుజువైంది. 1933 లో. అభివృద్ధి నిరోధకుల అండతో, యీ దుష్ట ఫాసిస్టులు సింహాసన మధిష్టించి తమ వాగ్దానాలను కార్యరూపేణ నెరవేర్చ బూనారు. అన్ని కార్మిక సంఘాలను రద్దుగావించి వాటి ఆస్తిపాస్తులను జప్తు చేశారు. కార్మికులయొక్క పత్రికా స్వాతంత్ర్యాన్ని, వాక్ స్వాతంత్ర్యాన్ని రద్దుచేశారు. కమ్యూనిస్టులు, సోషల్‌డెమోక్రాట్లు (సాంఘిక ప్రజాస్వామ్యవాదులు) ఇతర కూలీ—రైతునాయకులు వేలసంఖ్యలుగా ఖైదుచేయబడ్డారు. కొన్నివేలు హత్యగావించబడ్డారు. గొప్ప గొప్ప శాస్త్రజ్ఞులకు, వైద్యులకు యితర కళాపోషకులకు యిదేఖర్మం చుట్టుకుంది. ఇలాంటి మేధావులు కొందరు త్వరలోనే మృత్యువువాత బడ్డారు. మరికొందరు కాన్‌సన్‌ట్రేషన్ క్యాంపులలో (ఖైదీలను హింసించను, పనిచేయించను ప్రత్యేక చెరసాలలు) చిత్రవధలకు గురి అయ్యారు. కొన్నివేలమంది భయపడి జర్మనీనుంచే పారిపొయ్యారు. అమూల్యమైన గ్రంథాలన్నీ అగ్నిహోత్రునిపాలైనవి. మాక్సిమ్‌గోర్కీ, టాల్‌స్టాయ్ లాంటి మహనీయుల రచనలుగూడా నాశనంచేయబడ్డవి. యూదులను సమూలంగా నాశనంచేయడం వారినుండి కాజేసిన ధనమంతా స్టారం ట్రూపులకు అందించడం హిట్లరు పార్టీయొక్క ప్రధానాశయమైంది.

## 2. బీద ప్రజకు వెన్నుపోటు

స్వయంపోషకులైన చేతి పరిశ్రమదారులనూ కొద్ది కొద్ది వ్యాపారస్థులనూ, బీద ప్రజలనూ వుద్ధరించుతామనిగదా యీ ఫాసి

స్టులు ప్రకటించింది. ఆచరణలో జరిగిందేమిటి చూడండి: చేతి పనులవలన జీవించేవారు యెలా దివాలా తీశారో జర్మను "చేపరిశ్రమ కూలీల" 1937 వార్షిక సంచికలో కన్పించుతుంది. 1936 లో 1,32,109 ఆర్టిజన్లు (చేతిపనివారలు) వారి ఖార్ఖానాలను యెత్తివేసుకోవలసి వచ్చింది. ఈ సంఖ్య ప్రతియేటా పెరుగుతూనే వచ్చింది. 1936 ప్రారంభంలో యీ విధంగా మూసివేయబడ్డ కంపెనీల సంఖ్య 29,351 వుంటే 1936 అంతానికి 36,237 కు పెరిగింది. 1937 మార్చికి యీ సంఖ్య 40,968 కి వచ్చింది. మొత్తం మీద 1936 ప్రారంభంనుండి 16 మాసాల్లో 1,73,077 కంపెనీలు దివాలా తీశాయి. 1939 లో యీ ఫాసిస్టు ముఠా జర్మనీలోని చిన్న చిన్న పరిశ్రమలను అన్నిటినీ యెత్తివేయించి వాటి యజమానులనందరినీ పెద్ద పెద్ద ఆయుధ కర్మాగారాలలో పనిచేసేందుకై పంపింది. ఫాసిజం అంటే కొండంత ఆశపడ్డ మధ్యతరగతి ప్రజలు యిలాంటి ఫలితాల ననుభవింపవలసి వచ్చింది. మొదట్లో కార్మికులను, కమ్యూనిస్టులను అణచివేసేందుకు ప్రభుత్వం యీ మధ్య తరగతి ప్రజల నుపయోగించుకుంది. కార్మికవర్గం అణచివేయబడ్డ పిమ్మట యుద్ధానికి తయారయ్యేందుకు—ఫాసిస్టు జేబుల నింపుకునేందుకు—యీ మధ్య తరగతి అంతా ఆయుధ కర్మాగారాలలో చాకిరీ చేసేందుకు తరుమబడ్డది.

## 3. రైతునోట్లో దుమ్ముకొట్టడం

ఈ దొంగ ఫాసిస్టులు ప్రత్యేకంగా తాము రైతాంగాన్నే కాపాడ్తామని అరిచారు. శరీరానికి రక్త నాళాలు యెలాగో జర్మనుజాతి కంతకూ యీ రైతులు అలాగని పొగడారు. కాని హిట్లరు పార్టీ అధికారంలోకి వచ్చింతరువాత రైతాంగం పొందిన ఫలితాలు వారిని పీల్చి పిప్పిచేయు సిస్తులు. పండించిన

ధాన్యమంతా అడిగిన ధరకు ప్రభుత్వపు కొట్లలో కుమ్మరించడం మినహా వేరేవీ లేవు. రైతు తినే తిండికికూడా రేషనింగ్ అమలు పెట్ట బడింది. నేటి జర్మనురైతు అరకడుపు అన్నంతో బ్రతుకు తున్నాడు. ప్రభుత్వపు లెక్కలకంటే యెక్కువ తిండి తిన్నారనో, లేక అదనం ధాన్యం నిలువచేసుకున్నారనో, నెపంపెట్టి బోలెడు మంది రైతులను నేటి హిట్లరు జర్మనీలో అతి క్రూరంగా కోర్టులు శిక్షిస్తున్నవి.

హిట్లరుపుణ్యమా అంటూ జర్మనీ రైతు దినదినానికి నిరుపేదగా తయారవుతున్నాడు. తన భూమిని పోగొట్టుకొంటున్నాడు. మరి యొకవైపు జమీందారులు వేలవేల యెకరాల విస్తీర్ణం యెస్టేట్లను (జమీన్లను) ఆర్జిస్తున్నారు. మూడు యెకరములలోపు విస్తీర్ణంగల భూమిని కలిగిన రైతులు 20,00,000 కు మించివున్నారు. 3,500 భూస్వాములకు సగటున ఒక్కొక్కరికే 1,700 యెకరములభూమి వుంది. పూర్వపు సామ్రాజ్యవాదుల యెస్టేట్లన్నీ చెక్కుచెదరకుండా అలానే వున్నాయి. గోరింగు మిత్రుడైన హెస్సీ రాకుమారునకు 4,200 యెకరముల భూమివుంది. అన్‌హాల్టు యువరాజుకు 17,580 యెకరముల భూమివుంది. గోరింగుకు కూడా చాలా గొప్ప జమీన్ వుంది. అది చాలకకాబోలు హిట్లరు బవేరియాలో అతనికి 1,200 యెకరాలభూమిని బహుమతిగా యిచ్చాడు. జర్మను రైతును బాగుపరచడానికి యీ విధంగా హిట్లరు ప్రభుత్వం కృషిచేస్తోంది. రష్యాలో పూర్వముండిన జారు ప్రభుత్వానికీ ప్రస్తుతం జర్మనీలో వున్న హిట్లరు ప్రభుత్వానికీ తేడా యినుమంతైనా లేదు.

ఇది చాలదంటూ 1933 లో ఫాసిస్టు ప్రభుత్వం ఒక నూతన చట్టాన్నితెచ్చి రైతుల నెత్తికి కట్టింది. ఈ చట్టప్రకారం యేరైతు కుటుంబానికికాని 6 ఎకరములు, లేక అంతకుమించిన భూస్థితి గాని వుంటే ఆ భూమంతా పెద్దకుమారునికే చెందుతుంది.

ఈ అభివృద్ధినిరోధక చట్టంవలన రైతుకుటుంబాలు విచ్ఛిన్నమైనవి. కుటుంబాలలోని చిన్న పిల్లలు తమయిండ్లకు యెడమయ్యారు. హిట్లరు యీవిధంగా రైతుకుటుంబాలనుకూడా చీల్చి పాలించే నీతి సూత్రాన్ని అమలు పరిచాడు. 1933-39 ల మధ్య 100 కి పదిమంది రైతులు తమ భూమిని కోల్పోయి యెండు బొమికెలతో బయట బడ్డారు.

ఒక జర్మను యుద్ధఖైదీ యిలా అన్నాడు — "10 ఆవులు, 3 గుఱ్ఱాలు గల్గిన ఒక ధనికుడైన రైతునుండి నేను కొంతభూమిని కౌలుకు తీసుకొన్నాను. దానికి ప్రతిఫలంగా నేను సాలీనా చాల రోజులు అతనికి వెట్టిచాకిరీ చేయవలసివుండేది. అదైన 80% రోజులు అతనికి మిక్కిలి అవసరమైనరోజుల్లోనే యీ వెట్టి చాకిరీ చేయించుకునేవాడు. అంతేగాక నాభార్యగూడా అతనియింట్లో కొంత వెట్టిచాకిరీ చేయవలసి వుండేది. పైగా ప్రతియేడాది నేను అతనికి రూ. 300 లు యివ్వవలసి వుండేది."

ప్రస్తుతం యుద్ధ ఖైదీగావున్న ఒక డాక్టరు జర్మనురైతు స్థితిని యిలా వర్ణించాడు—"జర్మనురైతు తాను వెన్న తయారు చేసుకోడానికి, వెన్న, మజ్జిగ మొదలైన ఆహారం దినుసులు అమ్ము కునేందుకు వీలులేదు. తనకు కావలసిన ఆహారాల దినుసులుకూడా యేదినానికి సరిపోయేవి ఆ దినానికే కొనితెచ్చుకోవాలి." జర్మను రైతుయొక్క ఆర్థికావస్థనుగూర్చి ఫాసిస్టు పత్రికలే అప్పుడప్పుడు "మొసలి కన్నీళ్ళు" పెట్టుంటవి. 1934 లో వున్న గుఱ్ఱాలసంఖ్యలో, 1941 ఫిబ్రవరిలోవున్న సంఖ్య 100 కి 72 వంతులు మాత్రమేనని ప్రభుత్వమే అంగీకరించక తప్పిందికాదు.

అయితే యిక జర్మనీలో హిట్లరును బలపరచేదెవరు ? ప్రొద్దు పొడుపెరుగని పెట్టుబడిదారులూ, పెద్ద భూస్వాములూ మాత్రమే

హిట్లర్ను బలపరుచుతారనీ, కార్మికవర్గం, బీదరైతులు హిట్లర్ను తమ శత్రువుగా భావించుకుంటారనీ మరియొక యుద్ధఖైదీ చెప్పాడు. ప్రస్తుతం రైతులు మరీ చితికిపోతున్నారు. యుద్ధభారంతో జర్మను రైతు యమయాతన ననుభవించుచున్నాడు. సోవియట్ సంయుక్త రాష్ట్రింతోటి యుద్ధం జర్మనురైతుయొక్క చావుకే తేబడింది.

## దోపిడీ, రక్తపిపాస—ఇదే ఫాసిస్టు నీతి

కార్మికులను అణగద్రొక్కడం—క్రూరనిర్బంధవిధానం—వెలుగునిచ్చే గ్రంధాలను తగులబెట్టడం—యూదుల జాతిని సర్వనాశనంచెయ్యడం—స్టారం ట్రూపులలో విచ్చలవిడిగా బందిపోటుతనాన్ని ప్రేరేపించడం—ఇదే ఫాసిస్టు నీతి. ఇలాంటి ఘాతుక చర్యల ద్వారా బూర్జువా వర్గాన్నంతటినీ సంతృప్తిచేయ చూస్తుంది. పై యధికారుల ఆజ్ఞలను శిరసావహించడమే ఫాసిస్టుల మహా లక్ష్యం. స్టారం ట్రూపులలో చేరినవారికి, కించిత్తు విజ్ఞానమైనా వుండ నక్కరలేదు—యంత్రంలాగు పనిచేయడమే వారివిధి. స్టారంట్రూపులు పదే పదే జర్మను బూర్జువాలను దోచుకోవడం కూడా కద్దు. అలాంటివారు కొందరు పదభ్రష్టులవుతుంటారు. ఫాసిస్టు నాయకుల ఆజ్ఞలను శిరసావహించేవారిలో వుక్కువంటి వారిని యస్. యస్. దళాలుగా తయారుచేస్తారు. స్టారంట్రూపులలోకూడ చైతన్యంగలవారిని, ప్రజలంటే సానుభూతి చూపేవారిని పార్టీనుంచి తొలగించి కాల్చివేయడమో లేక కాన్సన్ట్రేషన్ క్యాంపులలో బంధించి వుంచడమో జరుగుతుంది.

మొదట తన పార్టీలోను, క్రమేణ తన సేనలలోను హిట్లరు బహిరంగంగానే హింసచేయడం, లూటీలు చేయడం ప్రోత్సహించాడు. ఇతరుల కష్టాలనుచూచి విచారించడమనేది హిట్లరు సహించేవాడు కాడు. హిట్లరు నేర్పిన గుణపాఠమే ప్రస్తుతపు ఫాసిస్టుల

రాక్షసత్వం. దయారసం ఎలాంటిదో తెలియని సేనతోనూ, యస్. యస్. దళాలతోనూ ఫాసిజం జర్మను ప్రజానీకాన్నంతటినీ దోచుకుంటూంది. నరకతుల్యమైన యాతనల ననుభవిస్తున్నారు జర్మనులు పాపం! 1941 జూన్ 28 న కార్పొరల్ విల్లీమేస్‌కు అతని భార్య నుండి యీ వుత్తరం వచ్చింది—"రష్యాలో నీచేతికి చిక్కిందల్లా కాజెయ్యి. నీ పై యధికారుల ఆజ్ఞను నీవు పస్తుండనంతవరకే పాటించు. పిట్టీ క్లావెన్‌ను చూడు—తన అధికారుల నేమాత్రమైనా లక్ష్యపెట్టాడేమో—తుదిదినాల్లో నీవు ప్రేమించే ప్రతిదానినుండీ దూరంచేయబడ్డావు నీవు. నీచేతి కందిందల్లా గుటకాయిస్వాహా అనడానికి నీకు హక్కుంది. రష్యా విస్తీర్ణమైన దేశంగదా!—"

1941 జూలై 6 న యింకొక జర్మనుసైనికునకు అతనిభార్య నుండి యీ వుత్తరం వచ్చింది.— "తమరేదో నాకు పంపించానని వ్రాస్తున్నారు. కాని యింతవరకు నాకేదియు అందలేదుసుమండీ! త్వరలో అందుతుందేమోమరి. తమకొక ఉన్నికోటు లభిస్తే మరి నావిషయం మరువకండి. అలాంటి అవసరాలు యింకా యెన్నో వున్నాయి. క్రిందటిదఫా మీకు పంపమని వ్రాసిందిమాత్రం మర్చిపోకండి. పెద్దవస్తువేననుకోండి. అయితేనేం?—ఇంక, పూలు, సబ్బులు మొదలైనవి యేవి పంపినా సంతోషమే."

## ప్రపంచాధిపత్యానికే యీ "వుత్తమజాతి" అన్ననినాదం

పై ఉత్తరాల వంటివి యింకా యెన్నోవున్నాయి. చూడండి—ఫాసిజం జర్మనీలో యెంత అవినీతిని వ్యాపింపచేస్తుందో! జర్మను బూర్జువాలయొక్క, ప్రష్యను భూస్వాములయొక్క ప్రయోజనాల కోసం, యీ ఫాసిస్టు పశువులు చిన్న—పెద్ద జాతుల సిద్ధాంతాలను బోధిస్తూ, ప్రజలను మోసగించుతూ, దయాదాక్షిణ్యాలు లేని రాక్షస కృత్యాలు చేయవలసిందిగా రేకెత్తించుతూ, అభివృద్ధి చెందిన

మానవజాతిపట్ల ద్వేష బీజాలను వెదజల్లుతూ నేటివరకుగూడా అమానుషమైన చర్యలను జరిపించుచూ మానవాభ్యుదయానికే వేరు పురుగులుగా తయారైనారు.

జర్మనీలో 1933 లో ఫాసిస్టులు అధికారానికి రాగానే పశు తుల్యమైన నియంతృత్వాన్ని స్థాపించారు. పౌరసత్వ హక్కులు, వ్యక్తి స్వాతంత్ర్యము బూడిదపాలైనవి. పెట్టుబడిదారులందరి విశ్వాసాన్ని చూరగొనేందుకు హిట్లరు ప్రభుత్వం కార్మికవర్గాన్ని, మధ్యతరగతి ప్రజనూ రక్తపు టేరులలో ముంచడానికిసుమంతైనా వెనుతీయలేదు.

ప్రపంచాధిపత్యాన్ని సంపాదించగల శక్తి యూరపు ఖండంలో ఒకే ఒక జాతికి కలదని, అలాంటి గొప్పజాతి స్వచ్ఛమైన ఆర్యవంశానికి జెందిన జర్మనుజాతి మాత్రమేనని ఫాసిస్టులు డంబాలు కొట్టారు. ఐరోపాఖండంలో మరియే యితరజాతిగాని యీ పాత్రను నిర్వహించజాలదని వీరి గర్వం. ప్రపంచాధిపత్యాన్ని కాజేయడమే ఫాసిస్టు పార్టీయొక్క ప్రధానలక్ష్యం—కార్యక్రమంగూడాను. ఫాసిస్టు పార్టీయొక్క శైశవావస్థలో యీ కోర్కె రహస్యంగా వుంచబడి కేంద్రసభలలో మాత్రమే చర్చించబడేది. ఈ లక్ష్యాన్ని సాధించే నిమిత్తం యీ జర్మను సామ్రాజ్యవాదులు యూరపులోని యితర సామ్రాజ్యవాద ముతాలతో, గోముఖవ్యాఘ్రాలవలె, నాటకమాడ్తూ వచ్చారు. తాము బోల్షివిక్కు దయ్యాలపై యుద్ధానికి తయారగుచున్నారనీ, తత్కారణంగా తమ సైన్యాన్ని పెంపొందించుకోక తప్పదనీ వారి చెవులలో వూదేవారు. ఈ మాటలకు మోసపోయి ఐరోపాలోని పెద్ద పెద్ద సామ్రాజ్యవాద ప్రభుత్వాలు అందుకు తమ సానుభూతిని వెల్లడిస్తూ హిట్లర్ను బలపరిచాయి.

ఇంతటి అనుకూల వాతావరణాన్ని హిట్లరు చేజారనిస్తాడా? వర్సైల్సు సంధిద్వారా జర్మనీ యేమిచేయకూడదని నిషేధింప

బడిందో దానినే (నిర్బంధ సైనిక శిక్షణను)' ఫాసిస్టులు దేశంలో ప్రవేశపెట్టారు. అప్పటినుండి కార్యరంగంలోకి వురికారు. తాము గత యుద్ధంలో కోల్పోయిన రాష్ట్రాలను ప్రథమంలో కబళించారు. వీరి యీ ప్రయత్నంలో యెవ్వరునూ అడ్డురానందున 1938 మార్చిలో ఆస్ట్రియాను, 1939 మార్చిలో జికోస్లోవేకియాను కాజేశారు. మరొకవైపునుండి "యిదంతా సామ్యవాదభూతంపై విరుచుకపడడానికేసుమా" అని యీ దొంగలు యిండ్లెక్కి మరీ కూయసాగారు.

జర్మను ఫాసిస్టుల యీ సామ్రాజ్య తృష్ణ హద్దుమీరింది. 1939 సెప్టెంబరు 1 న జర్మనీ పోలెండుపై పడింది. దీనికి ప్రతిగా 3 వ తేదీన బ్రిటను, ఫ్రాన్సులు జర్మనీపై యుద్ధము ప్రకటించాయి. 18 దినాల్లో పోలెండు భూభాగాన్నంతా నాజీలు ఆక్రమించారు. జర్మను సైన్యాలు యూక్రేనియన్, బైలో రష్యను ప్రదేశాలనుగూడా ఆక్రమింప జూస్తున్న తరుణంలో మన ప్రభుత్వం యెఱ్ఱసైన్యాన్ని కదిపి యూక్రేనియన్, బైలో రష్యను ప్రాంతాలలోని పశ్చిమ జిల్లాలను ఆక్రమించి నాజీ పురోగమనాన్ని అరికట్టింది. 1939 ఆగస్టులో జర్మనీతో మన ప్రభుత్వం చేసుకొన్న ఒడంబడిక మనకెంత మంచిదో కనీసం యిప్పటికైనా ప్రతి ఒక్కరు గుర్తించివుంటారు. ఇతర కారణాలెలావున్నా దాదాపు రెండేండ్లు మనదేశం శాంతిని అనుభవించింది.

పోలెండును స్వాధీనం చేసుకున్న పిమ్మట జర్మను ఫాసిస్టులు ఒకరిపిదప నొకరుగా తమ ప్రతికక్షులను ఓడించుకుంటూ తుదకు ఫ్రాన్సుపై విరుచుకు పడ్డారు. 37 రోజులలో ఫ్రెంచి సైన్యాన్ని ఓడించారు. 1940 జూన్ 22 న ఫ్రెంచి ప్రభుత్వం జర్మనీతో సంధిచేసుకుంది. ఆ సంధి షరత్తులు ఫ్రాన్సు రక్తాన్నే పీల్చివేశాయి. పారిస్ నగరంతోసహా ఫ్రాన్సుదేశంలో సగభాగం నాజీల

హస్తగతమైంది. నాజీసేనలకయ్యే ఖర్చు సైతం ఫ్రెంచి ప్రజల పైనే రుద్దబడింది. ఫ్రాన్సు యింత త్వరలో ఓడిపోవడానికి పెక్కు కారణాలున్నాయి. వాటిలో ప్రధానమైంది—ఫ్రెంచి ప్రభువులు నాజీ జర్మనీకన్న ఫ్రెంచి ప్రజలంటెనే అధికంగా భయపడి జర్మనీతో పోరాటం మానివేయడం. ఫ్రెంచిపాలకవర్గం, ఫ్రెంచి సేనా నాయకులు పదేపదే ప్రజలకు ఓటమి తత్వాన్నే బోధిస్తూ వచ్చారు. పంచమాంగదళ చర్యలు అధికమయ్యాయి. పైగా నాజీసైన్యానికీ, ఫ్రెంచి సైన్యానికీ హస్తిమశకాంతర వ్యత్యాసముంది. అలాంటి సైన్యాన్ని ఫ్రెంచి సైనిక నిపుణులు యూరపులోకెల్లా గొప్ప సైన్యమంటూ పొగడ్తూండేవారు.

ఫ్రాన్సు పతనానంతరం నాజీలు బ్రిటనుకు బుద్ధిచెప్పాలనుకున్నారు. రెండు, మూడు నెలలలో బ్రిటిష్ దీవుల నాక్రమించవచ్చునని, అంతటితో యూరపుఖండం, తక్కిన ప్రపంచం తమచేతిలో వస్తుందనీ అంచనా వేశారు. బ్రిటన్, అమెరికాల ప్రపంచాధిపత్యాన్ని త్రోసి, తాను ప్రపంచాధిపతి కావలెనని హిట్లరు నడుము బిగించాడు. పాపం, గంపెడంత ఆశతో బ్రిటనుతో యుద్ధమారంభించాడు. కాని బ్రిటను కొరకరాని కొయ్యగా పరిణమించింది. తానాశించినంత త్వరలో బ్రిటను యుద్ధం సమాప్తి అయ్యే సూచనలేవీ కనిపించలేదు. సరిగదా, నాజీ ప్లానులే బోర్లపడ్డాయి. బ్రిటను విమానబలంకంటే జర్మను విమానబలమే అన్నివిధాల మిన్న అయినప్పటికీ, ఇంగ్లండుపై హిట్లరు కురిపించిన బాంబులవర్షం అతనను కున్నంత ఫలితాలను చేకూర్చలేదు. మీదు మిక్కిలి బలమైన నావికాదళం జర్మనీకి లేనందున జర్మను సైన్యాలను, బ్రిటిష్ దీవులపై దించడానికి వీలులేకపోయింది. బ్రిటను, అమెరికాలు హిట్లరుతోటి దీర్ఘ యుద్ధానికి తయారగుతూన్నవి. బలమైన యూ

ముఠాతో దీర్ఘకాల యుద్ధంవల్ల యేర్పడే మంచిచెడ్డలు హిట్లరుకు బాగా తెలుసు.

అందుచేత సోవియట్ యూనియనుపై దొంగపోటు పొడవడానికి హిట్లరు ప్రయత్నించాడు. ఫాసిస్టుల ప్రధానాశయం ప్రపంచాధిపత్యం. అది సాధించాలంటే సోవియటు యూనియనుపై దాడి చేయాలంటూ జర్మను సైనిక నిపుణులు పదే పదే చెపుతూవచ్చారు. సోవియటు యూనియన్ను పూర్తిగా ఓడించడం, మహా అయితే, అయిదారు వారాలంటూ యీ నిపుణులు జోస్యం చెప్పారు. జర్మను సైన్యం అత్యల్ప నష్టంతోనే యీ మహా కార్యాన్ని సాధించుతుందని వీరు హామీయిచ్చారు.

అందుచే యీ నాజీ బందిపోటుదారులు మనదేశంపై అమాంతంగా విరుచుకుపడ్డారు. హిట్లరు ప్రభుత్వం యీ వుభయదేశాల మధ్య అమలులోవున్న నిరాక్రమణ సంధినిసైతం కాలరుద్ది, పట్టపగలే కన్నంవేయసాగింది. స్వతంత్ర జాతుల సోవియటు యూనియను ప్రజలను బానిసలుగాచేసి పశుతుల్యమైన రాక్షస ప్రభుత్వాన్ని నెలకొల్పడమే వారి మహదాశయం.

---

# 3. సోవియట్ ప్రజల ప్రబల శత్రువు

## ఫాసిస్టుల దురాక్రమణా శయాలు

ప్రపంచాధిపత్యమే నాజీల ఆశయమన్నది జగద్విదితము. ఈ వుద్దేశ్యంతోనే సోవియటుపై దురాక్రమణ జరిగింది. మనపై దాడిచేసే విషయంలో యీ ఫాసిస్టు ముఠా అందరు ఒకే దృఢాభిప్రాయానికి వచ్చారు. ప్రపంచంలోని కష్టజీవుల ప్రభుత్వం సోవియ

ట్లలో తప్ప మరెక్కడా లేదు. అట్టి మన ప్రభుత్వాన్ని సర్వనాశనం చేద్దామని, ప్రపంచ పటంలోనుంచి సోవియటును తుడిచివేద్దామని లిథుయేనియా, లాట్వియా, ఇస్తోనియా మొదలైన సోవియటు రాష్ట్రాల నన్నిటినీ తమ సామ్రాజ్యంలో కలుపుకుందామనేదే యీ నిరంకుశ జర్మనీ పాలకవర్గంయొక్క ఆశయం. మన భూభాగాలనూ, సాధన సంపత్తినీ అపహరించను మాత్రమేగాదు— యీ దుష్ట ఫాసిస్టుల కుట్రలు. వీరు మన జాతీయ గౌరవాన్ని కాలరుద్ద నున్నారు. మనల నందరినీ బానిసలచేయడమే వీరి ఆశయం. ఈ విషయంలో నెపోలియన్నుకూడా మించిపోయాడు హిట్లరు.

కాని హిట్లరు చాలా పొరబడ్డాడు. అందుకిప్పటికే తగుశిక్ష ననుభవిస్తున్నాడు. హిట్లరిప్పుడొక అగ్నిపర్వతంపైన కూర్చొనియున్నాడు. యుద్ధం చూద్దామా! తుది అంకం దాపునకైనా రాలేదు. కాని హిట్లరూ, అతని అనుచరులూ యిప్పటికే భావియూరపుదేశపు గతిని గురించి జోస్యం చెప్తున్నారు. యూరపులో యికముం దెవ్వరునూ సంపూర్ణ స్వాతంత్ర్యం కలిగివుండరట. జర్మనుజాతి కొక్కదానికే తగు గౌరవమర్యాదలు చూపబడుతాయని, హాలెండు, నార్వే ప్రజలుకూడా జర్మను జాతికి చెందినవారేనని హాలెండులోని హిట్లరు ప్రతినిధి సెలవిచ్చాడు. జర్మనుజాతి ఒక్కటే వున్నతస్థానానికి అర్హురాలని వీరి అభిప్రాయం. ఎంతవరకూ ఆత్మస్తుతి—పరనిందా—ఇవే వీరి నీతి సూత్రాలు.

నార్వే, హాలెండులు జర్మనుజాతికి జెందుతవి కాబట్టి వాటికి సాంస్కృతిక అధినివేశ ప్రతిపత్తి (కల్చరల్ ఆటానమి) యివ్వబడ్తుందట. దీనినిబట్టి మన ముందుగతి వూహించండి! మనమేదో ఆశాపూరిత భవిష్యత్తును యెదురుచూస్తున్నాము. మన ఆశలను నిరాశలు చేయడానికి నాజీలు చూస్తున్నారు. వారిదృష్టిలో మనం చాలా హీనంగా కన్పిస్తున్నాము. మనం ఆర్యుల వంశానికి చెందమనే

మిషతో మనను తక్కువ కులాలవారినిగా లెక్కగడ్తారు. ఈపై విషయాలన్నీ నాజీ పత్రికలలో వ్రాయబడ్డవే; పెద్ద పెద్ద సభలలో నాజీలచే చర్చించబడ్డ విషయాలే. సోవియటు రాజ్యాంగ యంత్రంలో



మాలటావ్

యెంతో వికసించిన మానవజాతిని మరల పశుయుగంలోకి దొర్లించవలెనన్నదే హిట్లరు ప్రయత్నం. తమకుట్రలు నెరవేరుననేగాబోలు వారి యాశ.

గత పాతికేండ్ల చరిత్రలోను మన ప్రజలెలాంటి సమాజాన్ని నిర్మించారో చూడండి. మన శ్రామికులు యెంతటి సాహసకృత్యాలు చేశారో యోచించండి! మన మాతృభూమిని ఒకసారి ఆపాద

మస్తకం వీక్షించండి! విజ్ఞానాన్ని మన ప్రజలు ఒకమెట్టునుండి మరియొకమెట్టుకు పైకి తీసుకవెళ్ళారు. ఈ నూతన సమాజంలో కార్మికులయొక్క నాగరికత కొన్నిరెట్లు అభివృద్ధిచెందింది. కార్మిక వర్గంయొక్క పటుత్వం హెచ్చింది. కార్మికవర్గంనుండి యింజ నీర్లూ, నేర్పరులైన శ్రామికులూ, ఎట్టిసేనా నాయకులూ యింకా అనేకరకాల శాస్త్రజ్ఞులు వేలసంఖ్యలుగా వుద్భవించారు. ఇచ్చటి వుత్పత్తి అంతయూ మన ప్రజలసొమ్మే. ఇచ్చటి ఫాక్టరీలు, మిల్లులు, విద్యుచ్ఛక్తి కేంద్రాలు, కాలువలు, రాకపోకల సౌక ర్యాలు, పాఠశాలలు, నాటకశాలలు, వైద్యశాలలు—ఒకటేమిటి, సోవియట్లలో నిర్మించబడ్డ ప్రతి వస్తువూ ప్రజలందరిదీ అయి వున్నది.

## మన సంపదపట్ల హిట్లరుకు కన్నుకుట్టింది

గంపెడంత ఆశతో జర్మనీలోని జమీందార్లు, సేనాధిపతులు, పెట్టుబడిదారులు మన ఆస్తులను, ధనాన్ని కొల్లగొట్టి మనలనంద రినీ బానిసలుగా చేసుకొని చాకిరీ చేయించుకోవాలని నిశ్చయించు కున్నారు. మన ప్రజానీకమంతా చెమటోడ్చి సంపాదించిన ఫలితా న్నంతా జర్మను సామ్రాజ్యవాదులు సరిగా వుపయోగించుకొనవల సిన విధానాన్నిగూర్చి నాజీ పత్రికలు నిర్మొహమాటంగా చర్చించు తునే వున్నాయి. నవంబరు 16 న జర్మనీలోని ఒక పత్రిక ఒక వ్యాసంలో యిలా వ్రాసింది—"వివిధ సోవియటు కర్మాగారాలు, వ్యవసాయ క్షేత్రాలు ప్రథమంలో నాజీ ప్రభుత్వం అధీనంక్రిందనే వుండాలి. క్రమేణా అవి జర్మను ప్రభుత్వంయొక్క ఋణాన్ని తగ్గిం చేందుకు వ్యక్తులపరం చేయబడవచ్చు. సోవియటు సంపదనంత టినీ వ్యక్తుల స్వాధీనంచేసే సమస్యను—జర్మను ప్రభుత్వంయొక్క అప్పులను తగ్గించే సమస్యతో లంకెవేస్తే చాలు. ఈవిధంగా కొన్ని

కోట్ల ధనం ఆర్జించవచ్చు. ఇదేవిధంగా ముడిపదార్థాలను, ఆహారపు దినుసులను చౌకగా అమ్మడంద్వారాకూడా అమిత లాభాలు సంపాదించవచ్చు."

పై ఒక్క దృష్టాంతాన్నిబట్టే జర్మను సామ్రాజ్యవాదుల తృష్ణ యెలాంటిదో వూహించవచ్చు. సోవియటు ప్రజను నగ్నంగా దోచుకోవడమే వారి ఆశ. పూర్వం యెప్పుడో నావికులు సముద్ర తీరాలవెంట వేటాడి ప్రజలను దొంగలించి సంతలలో అమ్ముకుంటూండేవారు. నేడు జర్మను బందిపోటుదారులు యూరపునంతా గాలించి వేలకొలది కార్మికులను బలవంతంగా బంధించి జర్మనీకి తీసుకపోయి, కాన్సన్ ట్రేషన్ క్యాంపులలో చాకిరిచేయిస్తున్నారు. పైగా బ్రిటిషు విమానాలచే ప్రతిదినము బాంబుల దెబ్బలకు గురి అయ్యే ప్రదేశంలోనున్న వివిధ కర్మాగారాలలో వీరిచే నిర్బంధంగా, విశ్రాంతి లేకుండా పనిచేయిస్తున్నారు. అలాంటి నరకాన్ని మన కార్మికులపైకూడా రుద్దచూస్తున్నారు. ఇంతటి ఘోరం జరుగుతుందా?

ఈ ఫాసిస్టు కింకరులు తమ రక్త సిక్త హస్తాలతో శాంతిని అనుభవిస్తూ మానవాభ్యుదయాన్ని వికసింపచేస్తూన్న మన కార్మికులను ఎదిరారు. ఆ కార్మికులే యిప్పుడు యెఱ్ఱసైన్యానికి ఆయుధాలను, మందు సామగ్రిని తయారుచేయడంలో తమ శక్తిని ధారవోస్తారు. ఫాసిస్టులు కోరినదాన్నే మనమిద్దాం. అజేయమైన మన యెఱ్ఱసైన్యం ఫాసిస్టు మూకలను శిరచ్ఛేదం గావించేందుకు మనమంతా ఇంకా యెక్కువ ఆయుధాలను, యెక్కువ బాంబులను తయారుచేసి యిద్దాం.

ఇక మన రైతాంగంయొక్క భవితవ్యం యేమిటో చూడండి. యూక్రేనియన్, బైలోరష్యను ప్రాంతాలలోని రైతులగూర్చి యింక

చెప్పేదేమీలేదు. ఇప్పటికే వారు యమయాతన ననుభవిస్తున్నారు. మన మాతృభూమినుండి యీ రాక్షసులు తరుమబడేంతవరకు మన రైతుల యిక్కట్లు దినదినానికి పెచ్చుపెరుగుతూంటాయి.

సారవంతమైన రష్యా భూమంతా నాజీల హస్తగతమైతే ఫాసిస్టు యూరపులో తిండికి కొదువే వుండదంటూ హిట్లరు బాకా వూది, తన సైన్యాన్ని ప్రోత్సాహ పరచడానికి యెన్నోమారులు ప్రయత్నించాడు. మన భూమిలో హిట్లరు కొత్తవింతను దేన్నీ సృష్టించబోవడం లేదు. ఇలాంటి కోర్కెను సఫలీకృతం చేసుకోడంలో హిట్లరు ఒక్కడే మొనగాడుకాదు. రష్యా భూమిని ఆక్రమించుకోవాలని పూర్వ మెప్పుడో ? ఎవరో ? అభివృద్ధి నిరోధకులైన పండితులు వ్రాసిన వ్యాసాలకు యిప్పుడు హిట్లరెంతో ప్రాముఖ్యాన్ని చూపుతున్నాడు. మొత్తంమీద ప్రష్యా భూస్వాములంతా రష్యా క్షేత్రాలకొరకు అఱ్ఱులుచాచుక కూర్చున్నారు. ఈ భూస్వాములు జర్మనీ రైతాంగంనుండి గుంజుకున్న భూములతో సంతృప్తి పడుట లేదు. మన భూమినంతా గుత్తచేసుకొని, తమకు పరాయి దేశాలలోకూడా యిన్నివేల యెకరాల భూమి వున్నదని అనిపించుకోవాలని వారి ఆశ.

మన సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకొరకు, మరనాగళ్ళ వుత్పత్తి కేంద్రాల కొరకు, మన పశువుల కొరకు జర్మను భూస్వాములు తహ తహలాడ్తున్నారు. మన రైతులనుండి యివన్నీ లాక్కొని మనచే నిర్బంధంగా, వూడిగం చేయించుకోవాలని చూస్తున్నారు. వారి దిక్కుమాలిన ఆశ యెంతవుందో యీ క్రింది వుత్తరం చెబుతుంది. పాల్ మేయరు అనే సైనికుడు తన భార్యకు వ్రాసి, జేబులో నుంచుకొనిన జాబులో యిలావుంది. — "ప్రియమైన గ్రేటా ! యీదపా నన్ను స్మరించుతూ ఆరగించడానికి నీకు ప్రసిద్ధిచెందిన డాన్ ప్రాంతంలో చేయబడిన సారాయిని పంపుతాను. ఈ రష్యా

యాత్ర దిగ్విజయమైన పిదప యీ నదీతీరాన మనం చక్కటి కుటీరాన్ని నిర్మించుకొని, తరుగులేని యీ సంపదను అనుభవిద్దాం. కొద్దికాలం ఓపిక పట్టు, గ్రీటా!—ఇచ్చట నూతన వ్యవస్థను స్థాపించేవరకు ఓపిక పట్టు."

పాపం యీ వుత్తరం తన భార్యకు అందకమునుపే అతడు శ్మశానవాటిక నలంకరించాడు. ఇచ్చట నూతన వ్యవస్థను స్థాపించి మన కర్షక రక్తాన్ని పిండుతూ, మన శ్రామికుల బొమికెలను నములుతూ, తన గ్రీటాతో సోవియట్ సారాయిని ఆరగిస్తూ ఆనందించాలని ఆతడి కుతూహలం. యుద్ధప్రారంభంలో జర్మను సైనికుల నుండి యిలాంటి వుత్తరాలు యెన్నో దొరుకుతుండేవి. ఇప్పుడలాంటివి చాల అరుదుగా కన్పించుతున్నాయి. అలాంటి వుత్తరాలు వ్రాయడం మానివేయడమే కాకుండా, జర్మను సైనికుడు తాను మనభూమిని సంపాదించుకోగల ననే ఆశనుకూడా క్రమేణా కోల్పోతున్నాడు. మన పవిత్రభూమినుండి యీ రాక్షసులు తరిమివేయబడ్డనాడైనా వీరు నిజాన్ని గ్రహించలేకపోతారా! మన సోవియట్ యూనియన్‌లో చాల గొప్ప మేధావు లుత్పన్నమయ్యారు. సోవియట్ ప్రజల సర్వతోముఖాభివృద్ధికి యీ మేధావివర్గం ఎంతో పాటుపడింది. ప్రజానీకంలో యీ మేధావులు పాతుకపోయి ప్రజల మంచి చెడ్డలే తమవిగా యెంచుకుంటున్నారు. ఫాసిజం జయించే పక్షంలో మన మేధావుల కేలాంటి వుపద్రవమేర్పడేదీ మనకు తెలియనిది కాదు. నాజీ ఆక్రమిత రష్యాలో మన మేధావు లిప్పటి కప్పుడే అష్టకష్టాలు పడుతూన్నారు. మన భూమిలోకి చొచ్చుకవచ్చిన యీనాజీ దొంగలు తరిమివేయబడ్డ పిమ్మటే మన మేధావులు సంరక్షింపబడేది.

మనం రేయింబవళ్లు గాఢంగా ప్రేమించుకునే మన శిశువులకు సహితం యిలాంటి ప్రమాదమే తటస్థించింది. మనము, మన

ప్రభుత్వంకూడా యెంతో శ్రమపడి మనపిల్లల దేహారోగ్యాన్నీ, వారి మనోధైర్యాన్నీ పెంపొందించుచున్నామో, వారి సర్వతోముఖాభి వృద్ధికి యెలాంటి తిన్నటి బాటవేస్తున్నామో యోచించండి:— మన బాల బాలికలు మనదేశంలో తామెచ్చటనున్నా, తమ యిండ్ల వద్దనూ, తల్లిదండ్రుల వద్దనూ వున్నామనే భావించుకొంటారు.

## ఫాసిస్టులు జీవించియున్నంతవరకు మనకు మోక్షంలేదు

ప్రపంచ సంపదను కొల్లగొట్టడానికే నేడు జర్మనీ యుద్ధం చేస్తూంది. విజయోన్మత్తులైన జర్మనుపాలకవర్గం యిప్పుడు సోవియట్ను కబళించి పిమ్మట బ్రిటను, అమెరికాలపై తమ కత్తిని త్రిప్పాలని యోచిస్తున్నారు. అమెరికా సంయుక్త రాష్ట్రాలపైకూడ జర్మనీ యుద్ధం ప్రకటించడంతో యిది రూఢియని వెల్లడయింది. 1941 నవంబరు ఆఖరులో యాన్టికొమింటరన్ పాక్టును (కమ్యూనిస్టు వ్యతిరేకసంధి) యింకా పొడిగించుటకు అక్షరాజ్యాలకు (జర్మనీ, ఇటలీ, జపాను) జరిగిన సమావేశంలో ఐరోపాలో యేర్పడబోతున్న నూతన వ్యవస్థనుగూర్చి మాట్లాడుతూ రిబ్బన్ట్రాప్ యిలా అన్నాడు—"సోవియట్ యూనియన్ పూర్తిగా ఓడిపోయింది. ఇప్పుడు అక్షరాజ్యాలన్నీ ట్రాన్సు ఓషియానిక్ దేశాల నుండి స్వతంత్రం పొందాయి. నిస్సంకోచంగా యూరపు అంతా బ్లాకేడు (బహిష్కరణ) ప్రమాదాన్నుండి తప్పించబడింది. యూరపియన్ రష్యాలోని గోధుమలు, ముడిసరకులు యూరపు అంతటికీ చాలు. రష్యా యుద్ధపరిశ్రమలన్నీ అక్షరాజ్యాల యుద్ధావసరాలను తీర్చుతాయి. ఈవిధంగా బ్రిటనుపై తుది విజయాన్ని సాధించడానికి మనకున్న ఆఖరు చిక్కులు రెండు తొలిగాయి. ఈ యుద్ధం యిలా సాగిపొయ్యేకొద్దీ, మున్ముందు వుత్తర అమెరికా—బ్రిట

సులు ఒక పక్షంగానూ, మిక్కిలి బలంగల ఐరోపా కూటమి యావత్తూ వేరొకపక్షంగానూ నిలుస్తాయి. ఇంగ్లండును ఓడించే విషయంలో ఇటలీ—జర్మనీలు తమ యావత్తు సేననూ, నావిక, విమాన బలాలనూ కేంద్రీకరించి పోరాడుతాయి."

ఈవిధంగా హిట్లరూ, అతని తొత్తులూ యిప్పటి కప్పుడే వారి భావి ప్లానులన్నీ కుండ బ్రద్దలుకొట్టి చెప్పివేస్తున్నారు. ఇప్పుడు నోరు మెదుపకకూర్చుంటే ముందు ముందు యీ మాటలను దిగ మింగవలసిన అగత్యం యేర్పడదు కదా!

బాల్టిక్ దేశాలనూ, యూక్రేనియన్ ప్రాంతాన్నీ, బైలో రష్యానూ హస్తగతంచేసికోవాలని యీ నాజీ మృగాల ఆశ. డాన్, క్యూ బాన్ ప్రాంతాలలో యీ నాజీ హంతకులు పెద్ద జమీన్లను యేర్పరచుకోవాలనుకుంటున్నారు. ఫ్రాన్సులో, నాజీల వుప్పు పులు సులు తిని, మాతృదేశాన్ని సైతం వారికి బలియిచ్చిన పెటేన్ ప్రభుత్వంలాంటి ప్రభుత్వాన్నే సోవియట్ యూనియన్‌లో కూడా యేర్పరచాలని యువ్విళ్ళూరుతున్నారు. మన యుద్ధపరికరాలను మొత్తం కొల్లగొట్టి, మనరైతు చెమటకార్చి పండించిన గోధుమ పంటనంతా సులభంగా దిగమ్రింగి, ఏ కార్మికుల చేతులలోనుండి తాము కర్మాగారాలను లాక్కున్నారో, ఆ కార్మికులతోనే అవే కర్మాగారాలలో బలవంతంగా ఆయుధాలను పుత్పత్తి చేయించు కొంటూ, ప్రపంచ ప్రజలందరూ అక్షరాజ్యాల దాసులయ్యే వరకూ యీ యుద్ధాన్ని పొడగించాలంటూ భ్రమపడుతున్నారు—యీ నాజీ తుంటరులు. పిటేన్ ప్రభుత్వంలోని ఫ్రెంచి ప్రజ లెలా నాజీ బంది పోటుదారుల పొట్టల నింపేందుకు తమ ప్రాణాలను యుద్ధరంగాలలో బలియిస్తున్నారో అదేవిధంగా జర్మనీ జయించే పక్షంలో రష్యా ప్రజలు, యూక్రేనియన్లు, బైలో రష్యన్లు, అంతా నాజీల రక్తపిపా

సను తీర్చేందుకు తమ ప్రాణాలను బలియివ్వవలసి వుంటుంది. ప్రపంచాన్నంతా జయించాలనడంలో హిట్లరు కోరేదిదే. అంటే, మన ప్రజలంతా పశు యుగంలోకి యీడ్వబడుతున్నారన్న మాట.

కామ్రేడ్స్—వినండి! పవిత్రమైన మనదేశాన్నీ, మన ప్రజానీకాన్నంతటినీ హిట్లరేవిధంగా వుపయోగించుకొనాలని తాపత్రయ పడ్తున్నాడో! ఇలాంటి దుష్టబుద్ధులకు యెలాంటి నీతిగరపాలో ఆలోచించండి!—మనదేశంలోకి అర్ధరాత్రివేళ జొరబడ్డ యీ ఫాసిస్టు బందిపోటుదారులను అతి బలయుతమయిన మనచేతులతో, బలంగా సుత్తె దెబ్బలు కొడదాం.

---

# 4. నాజీల అంచనాలన్నీ తలక్రిందు లైనాయి

సోవియట్ యూనియన్ను జయించడానికి హిట్లరు పంపిన సైన్యం చాలా పెద్దది. యుద్ధ ప్రారంభంలో దీనికి చాల యంత్ర దళాలు, విపరీతమైన ఆయుధ సామగ్రీ వుండేవి. పశ్చిమ యూరపులో యింతవరకూ (రెండేండ్లుగా) జరిగిన యుద్ధాలలో ఈ సైన్యం మంచి అనుభవం గడించింది. తన శైశవావస్థనుండి కూడా ఈ సైన్యం ఫాసిస్టు పాఠాలనే నేర్చుకొనివుంది. ఇంతవరకు యీ సైన్యం తన విజయోత్సాహంలో ప్రజలను విపరీతంగా దోచుకోడంలోనూ, క్రూరంగా హింసించడంలోనూ ఆరితేరింది. యుద్ధమంటే కావలసినంత దోచుకోవడమేనన్న భావం జర్మను సైనికునిలో బాగా పాతుకపోయింది.

హిట్లరు కోరేది మిరుమిట్లు కొల్పే విజయాలు. మెరుపు యుద్ధంలో జర్మను సైన్యాలు బాగా తయారై వున్నాయి. ఈ మెరుపు యుద్ధపద్ధతితో సోవియట్ యూనియన్ ఓడిపోదని ఈ నాజీ పిశాచాలకు తెలుసు. తాము హఠాత్తుగా సోవియట్లను ముట్టడిస్తే సోవియట్ సేనలు ఖంగారుపడి తమ్ము ప్రతిఘటించే శక్తిని కోల్పోతవని జర్మను సైనిక నాయకులు భ్రమపడ్డారు. మోసపు హిట్లరు మాటలను జర్మను సైన్యంనమ్మి మోసపోయింది. సోవియట్లను జయించడం మిక్కిలి సులభమనీ. మహా అయితే రెండు మూడు నెలలో సోవియట్లను జయించి తాము మాతృభూమికి రావచ్చుననీ వెర్రిధైర్య పడ్డారు. యుద్ధరంగంలో పట్టుబడ్డ కొన్ని వుత్తరాలూ, డైరీలు (దైనం దినకార్య క్రమణికలూ) యిదే విషయాన్ని రుజువు చేశాయి. ప్రయివేటు కర్టుఫక్సు అన్న జర్మను సైనికుడు తన డైరీలో 1941 జూన్ 22 వ తేదీన యిలా వ్రాసుకొన్నాడు—"నేటి వుదయం మూడున్నర గంటలకు మన సైన్యం రష్యాలో చొరపడింది. మాదళాలకంటే ముందు యింకా యెంతో సైన్యం అలలు, అలలుగా—7 అలలుగా—జొరబడ్డది. అంటే మొదటి 7 జట్లూ యింకను వేకువనే వెళ్ళివుండాలి. మేజరు ముల్లరు అంచనా ప్రకారం రష్యా యుద్ధం మూడునెలలు పడ్తుంది. ఈ మూడునెలల్లోనూ మనకు సెలవు దయచేయబడదన్నమాట. రష్యానుండి జయప్రదంగా బయటపడుదుమనుకొంటాను."

యుద్ధరంగంలో చనిపోయిన మరియొక జర్మను సైనిక వున్నతోద్యోగి డైరీలో జూన్ 26 న యిలా వ్రాసివుంది—"ఇంకా యెంతకాలం ఈ యుద్ధం అన్నదే నన్ను కలవరపెడ్తూంది. పట్టణం ఫిరంగి మ్రోతలతో మారుమ్రోగుతూంది. మన ఫిరంగిదళం పట్టణాన్ని రక్షించుతునే వుంది కాని గుండ్లు కాల్చడంలో మాంద్యం యేర్పడింది. రష్యనులు వారి దళాలను చాలా దాపుకు తీసుకవచ్చి

మకాము చేశారు. పట్టణాన్ని ధ్వంసం చేయాలని వారియెత్తు. మరి యొక అయిదు దినాలవరకూ యీ పోరాటం సాగుతునే వుంటుం దనుకొంటాను."

ఈ వున్నతోద్యోగి మరియొక అయిదుదినాలలో యుద్ధం ముగిసి పోవచ్చునని వ్రాసుకోవడం నిజంగా అతని వూహకాదు. రష్యాను ఆక్రమించడం ఆరువారాలు మాత్రమే పడ్తుందని ఫాసిస్టులు మొదట్లో అంచనా వేశారు. మరియొక ఆరుదినాలతో నాజీ నాయకుల అంచనా ప్రకారం మొదటి వాయిదా అంతమవుతుంది. కాబట్టి యితడు వలోక్తిగా (నాజీ నాయకుల నెక్కిరించినట్లు) పై విధంగా వ్రాశాడు. ఈ విషయమే తాను మరుసటిదినం— జూలై 27 న—యిలా వ్రాసుకొన్నాడు—"తన దళంనుండి యిప్పుడే తిరిగివచ్చిన లెఫ్టినెంటు రీన్సు యీ యుద్ధాన్నుండి బయట పడడం చాలా దుర్లభమని అంటున్నాడు. ఈ సంగతి యింకా తనదళంలోని వారికి తెలియదట. ఈ సైనిక వున్నతోద్యోగియే యింకొకనితో మాట్లాడుతూ ఈ యుద్ధం యింకా పది దినాలు సాగినా మన పరిస్థితి యెంతమాత్రం బాగుపడదని నుడివాడు."

## మొదటి దెబ్బ జర్మనీ కొట్టింది

రోజులు గడచినకొద్దీ సోవియటు యూనియన్ను త్వరగా పాదాక్రాంతం చేయడం అసాధ్యమని నాజీలు గుర్తిస్తున్నారు. మనపై దురాక్రమణ జరిగింది లగాయితూ జర్మను సేనలను యెఱ్ఱ సైన్యం వీరోచితంగా ప్రతిఘటిస్తూనే వుంది.

1941 జూలై 3 న తన రేడియో వుపన్యాసంలో కామ్రేడ్ స్టాలిన్ రష్యా జర్మనీ యుద్ధం, జర్మనీకి అనుకూలపరిస్థితులలోను, మనకు ప్రతికూలంగాను ప్రారంభమయిందని చెప్పాడు. అయినప్పటికీ మన సైన్యంయొక్క తీవ్ర ప్రతిఘటనా ఫలితంగా జర్మనీ

యొక్క వుత్తమ దళాలన్నీ ధ్వంసమైనాయి. మనసేనలు తిరోగమ నంచేయడానికి హేతువేమిటని కొందరు ప్రశ్నిస్తూవున్నారు. జర్మను సేనలకంటే మనవి బలహీనమైనవా? మన పరిశ్రమల కంటే జర్మను పరిశ్రమలు బాగా పనిచేస్తున్నవా? ఇలాంటి సందే హాలను కొందరు వెల్లడిస్తున్నారు. కాని వారి పరిశ్రమలకంటే మన పరిశ్రమలే బాగా పనిచేస్తున్నవని మన శత్రువుకే యిప్పటికి బాగా తెలిసి వచ్చింది.

మనపై దురాక్రమణ యుద్ధానికి నాజీలు కొండంత యుద్ధ సామగ్రిని తయారుచేశారు. కొన్నియేండ్లనుండీ జర్మను పరిశ్రమలు యుద్ధ సరఫరాకే వుత్పత్తి చేస్తున్నాయి. మనపై యుద్ధాన్ని సాగిం చను యీ నాజీ పిశాచులు విరోపా దేశాల నన్నింటినీ కొల్లగొట్టి వాటి సాధన సంపత్తినీ, పరిశ్రమలనూ యుద్ధము కొరకే వుపయో గిస్తున్నారు. ఇక మన పరిస్థితి విచారిద్దాం. ఇలాంటి దురాక్రమణ మనపై జరుగుతూందనీ దాన్ని తట్టుకోవాలనీ మనం ప్రయత్నిం చాము. రానున్న దురాక్రమణలను అడ్డుకునే ప్రయత్నంలో మన మున్నప్పటికీ, మన ప్రజల స్థితిగతులను, వారి విజ్ఞానమును పెంపొందించేందుకు మన ప్రభుత్వం కించిత్తయినా అశ్రద్ధ చూప లేదు. మరియొక కారణంకూడవుంది. జర్మనీలో ఫాసిస్టులు అధి కారంలోకి వచ్చేసరికే పారిశ్రామికంగా జర్మనీ చాలా ముందుకు సాగింది. ఇక మనము, అపాదమస్తకం, పరిశ్రమలను నిర్మించు కోవలసి వచ్చింది.

అంతేగాక మొదటిదెబ్బ జర్మనీ తీసింది. సాధారణంగా యెలాంటి కొట్లాటల్లోనైనా మొదటి దెబ్బ తీసినవానికి ఆరంభంలో చాలా లాభం కన్పించుతుంది. యుద్ధరంగంలో యేదో ఒకస్థలంలో తన సర్వశక్తిని కేంద్రీకరింపజేసే అవకాశం అతనికి లభిస్తుంది.

ఇక 1,500 మైళ్ళ పొడవున జరిగే యుద్ధంలో ముట్టడి కాచుకునే పక్షం యుద్ధరంగం పొడవునా శత్రుసేనలను విచ్ఛిన్నంచేయ జాలదు. తత్కారణంగా మొదట జర్మనీకి విజయాలు సిద్ధించాయి. స్వల్ప ప్రతిఘటన వున్నచోట యీ నరహంతకులు మన జన్మ భూమిలోకి చొచ్చుకవచ్చారు.

ఎఱ్ఱ సైన్యం యింతవరకూ వెనుకకు మరలడానికీ, మనం కొంత భూభాగాన్ని కోల్పోవడానికీ మరియొక కారణంవుంది. వేల కొలది విమానాలనూ, టాంకులనూ, విధ్వంసక ఆయుధ సామ గ్రినీ కలిగియుండి యుద్ధమే జీవితాశయంగా యెంచుకునే దుష్ట నాజీ సైన్యం వున్నట్లుండి మనపై 1,500 మైళ్ళ పొడవున దాడి ప్రారంభించడమే కారణం. కామ్రేడ్ స్టాలిన్ తన 1941 నవంబరు 6 న వుపన్యాసంలో చెప్పినట్లు యూరపులో రెండవ రంగం లేకపో వడంకూడా ఒక కారణం. ముందుకు చొచ్చుకవస్తూన్న జర్మను సేనలను అరికట్టడమే మనవంతైంది. అంటే, ఎఱ్ఱసేనకు పరిస్థి తులు సుముఖంగా లేవన్నమాట. ఎప్పుడూగూడా యేమరుపాటున నున్నప్పుడు తగిలినదెబ్బ యెంతటి బలవంతునికైనా నొప్పిని కలిగి స్తుంది. ఈ దృష్టితోనే అంతిమ విజయం సులభసాధ్యమని నాజీ దురాశాపరు లువ్విళ్ళూరారు.

జర్మనీతోటి యుద్ధం యేనాటికైనా తప్పదని మన ప్రభుత్వం, సైనిక నిపుణులూ యెన్నడో గ్రహించారు. అందుకు సంసిద్ధ మయ్యారుకూడాను. కాని సోవియటు యూనియన్‌కూ జర్మను ప్రభు త్వానికీ మధ్య అనాక్రమణ సంధి అమలులోవుంది. మన ప్రభుత్వం ఆ సంధి షరత్తులను తూచా, తప్పకుండా పాటించింది.

ఈ నాజీ పశువులతోటి యుద్ధంలో మన యెఱ్ఱసైన్యం మంచి అనుభవం గడించింది. ఇప్పటికే, నాజీలకు విపరీత నష్టాలను

కలుగజేసి తన దేశభక్తిని ప్రదర్శించుకుంటూంది. మనం ప్రతి దాడులు చేసేదినం దగ్గరకు వచ్చింది. చాలాచోట్ల జర్మనుసేనలు చావు దెబ్బలు తింటున్నాయి. ఇంకా జర్మనుసేనలబలం పూర్తిగా విచ్ఛిన్నం కానప్పటికీ, కామ్రేడ్ స్టాలిన్ పదే పదే నుడివినట్లు అంతిమవిజయం మనదేను అనడంలో యెలాంటి సందేహమూలేదు.

## జర్మను అంచనాలన్నీ యింకిపోయాయి

తమ సైనిక చర్యలన్నీ అంచనా ప్రకారం జరుగుతూన్నాయనీ ఫాసిస్టు నాయకులు దంభాలు కొట్టారు. జర్మనీ సైనికచర్యలు సుసంఘటితమైనవి—కొంత అంచనా ప్రకారం జరుగుతుంటాయి అన్న విషయం యెవరు కాదనరు. కాని అంతమాత్రంలో యెవరూ మోసపోరు. ఎఱ్ఱసైన్యం కొట్టిన యెదురుదెబ్బలూ, మన యెదురు యెత్తులూ, వ్యూహాలూ, పెక్కు పర్యాయాలు జర్మనుసేనల తప్పును అవి దిద్దుకునేలా చేశాయి. ఆచరణలో జర్మను అంచనాలు యెంతవరకు ఫలప్రదమైంది చూతాము.

## మొదటి అంచనా

యుద్ధ మారంభమైన మూడు వారాల్లో తాము మాస్కోలో మకాముచేయడం మొదటి అంచనా. ఈ అంచనా యెవరో కొందరు వ్యక్తులు ఆషామాషిగా అనుకొన్నదేమీకాదు. ప్రముఖ జర్మను సేనానాయకులే ముందుగా వివిధ పార్టీల బలా బలాలను తూచి, అంచనావేసి, తమ క్రిందిసైనిక దళాలకు పంపిన అంచనా యిది. ఈ మొదటి అంచనా భగ్నమైంది.

## రెండవ అంచనా

ఆరు వారాలలో మాస్కో చేరడం రెండవ అంచనా. పైద్ద పెద్ద సైనిక నాయకులు వేసిన యీ అంచనాకూడా వమ్మయింది.

## మూడవ అంచనా

మూడు నెలలలో మాస్కోలో పీఠం వెయ్యడం మూడవ అంచనా. జర్మను సైనిక నిపుణులు యీ అంచనా అక్షరాలా నెర వేర్తుందని నమ్మారు. వారేకాదు జర్మనీకి వెలుపలనున్న ప్రపంచ ఫాసిస్టులందరూకూడా నమ్మారు. కాని మాస్కో నీడలైనా వారికి కన్పించలేదు.

## నాలుగవ అంచనా

ఈ దఫా మాస్కోను అక్టోబరునెలాఖరుకు (1941) స్వాధీనం చేసుకొంటామని అక్టోబరు 3 న హిట్లరు ప్రపంచాని కంతటికీ చాటాడు. అంతవర కెన్నడూ జరగని తీవ్రమైన దాడి ప్రారంభమయిందనీ, యీసారి సోవియటు యూనియన్‌లోని ముఖ్యమైన పారిశ్రామిక జిల్లాలు మూడున్నూ కొద్దివారాలలో తనకు స్వాధీనమవుతాయనీ ప్రగల్భాలు కొట్టాడు. హిట్లరు అంచనాప్రకారం అదే ఆఖరుదాడి. కాని అంచనాలు అంచనాలే కాని యదార్థాలుకావుగా! జర్మను సైనిక నిపుణుల యీ ఆఖరు అంచనాకూడా తలక్రిందైంది. అక్టోబరులో హిట్లరు ప్రారంభించినదాడి చాల బలవంతమైనదనడం నిర్వివాదాంశము. కాని మాస్కో ప్రాంగణంలోని యీ నాజీ పిశాచాల చర్యలు యెఱ్ఱసైన్యపు చర్యలతో పోల్చిన కోతి హనుమంతుని యెదుట వేసిన కుప్పిగంతులైనవి. జర్మనుసేనలు తమ జీవితంలో యేనాడు యెదుర్కొనని తీవ్ర ప్రతిఘటనను యిచ్చట యెదుర్కోవలసి వచ్చింది. కొన్ని లక్షల జర్మనుసైన్యం బలి అయింది. జర్మనులు విపరీతంగా ఆయుధ సామగ్రిని కోల్పోయారు. ఇంకా క్రొత్త రిజర్వు (అక్కర నిమిత్తము దాచియుంచిన సైన్యము) లను తెచ్చి మరియొకదాడిని ప్రారంభించడం అవసరమైంది.

1941 నవంబరు 16 న మాస్కోపైకి ఆరంభమైన మరియొక దాడి జర్మనులకు మరింత విపరీత నష్టాన్ని కలిగించింది. మాస్కోను చుట్టు ముట్టి స్వాధీనం చేసుకోవలె అనే వారి అంచనా వారి జేబులలోనే వుండిపోయింది. మాస్కో దాపుకు చేరేకొద్దీ జర్మను సేనలు చచ్చే దెబ్బలు తినవలసి వచ్చింది.

దక్షిణ రంగంలో రోష్టావ్‌వద్ద మనసైన్యం యీ నాజీ హంతకులను గట్టిదెబ్బ కొట్టింది. ఇచ్చట జనరల్ క్లీస్టు నాయకత్వాన పోరాడుచున్న బలమైన జర్మను సేన యావత్తూ సర్వనాశనం చేయబడింది. ఎంతోమంది మృత్యువువాత బడడం, గాయపడడం, పట్టుబడడం తటస్థించింది. కొంతభాగం జర్మనుసైన్యం చెల్లా చెదరై పారిపోయింది. మనకు టాంకులు, ట్రక్కులు, మరతుపాకులు, యితర యుద్ధసాధనాలు అపారంగా దొరికాయి. ఇంకా బోలెడు ఆయుధ సామగ్రిని జర్మనీ కోల్పోయింది. ఫాసిస్టు దురాశాపరుల నుండి చాల భూభాగం విముక్తిచేయబడింది.

మొదట జర్మనులు రోష్టావును స్వాధీనం చేసుకొన్నప్పుడు యెంతో సంతృప్తిచెంది, విరివిగా ప్రచారంకూడా చేసుకొన్నారు—తమ దిగ్విజయాన్ని. డానెట్జ్ ప్రాంతం మనకు చాలముఖ్యమైందనడానికి సందేహంలేదు. నాజీ హస్తాలనుండి రోష్టావ్‌ను మనం లాక్కున్నప్పుడు నాజీ పత్రికలు రోష్టావు అంత ప్రాధాన్యం కాదనీ, మాస్కో యుద్ధమే జయాపజయాలను నిర్ణయిస్తుందనీ ప్రచారం చేశాయి. మాస్కో ప్రాంగణంలో నేడు జరుగుతూన్న యుద్ధం అతి ప్రాముఖ్యమైందే. ఈ యుద్ధమే హిట్లరుకు అవసాన కాలాన్ని ప్రసాదించుతుందని మన మెరుగుదుము. ఏది యెలావున్నా జర్మనుల నాజీ సైన్యాన్ని సర్వనాశనం చేయడానికి మన వీరోచిత యెఱ్ఱసైన్యం కంకణం కట్టుకొన్నది. శాయశక్తులా కృషి సల్పుతూంది. నవంబరు, డిసెంబరునెలలలో వుత్తరరంగంలోని టిక్‌విన్ ప్రాంతం

లోను, నైరుతీ దిక్కున ఇలెట్స్‌వద్దను వేలకొలది ఫాసిస్టులను బలిగావించింది మన యెఱ్ఱసైన్యం. పై విజయాలన్నీ చాలా ప్రాముఖ్యమైనవని మనం గుర్తించుకోవాలి.

గత రెండుమాసాలలో మాస్కోవద్దను, తక్కిన రంగాలలోను యెఱ్ఱసైన్యంసాధించిన విజయాలు యెంత హీనంగా అంచనా వేసినా నాజీలకు వెన్నుపోటులాంటి వనక తప్పదు. 1941 నవంబరు 16 నుండి డిసెంబరు 10 వరకూ ఒక్క మాస్కో యుద్ధంలోనే 85,000 నాజీలు హతులయ్యారు. నాజీలయుద్ధ సామగ్రి యెంతో మనపరమైంది. తదితర రంగాలన్నింటిలోనుకూడా నాజీల కించుమించు యిలాంటి నష్టాలే కలుగుతున్నాయి.

నాజీ సేనల నైతికబలం నానాటికీ క్షీణించుతూంది. శారీరకంగాగూడా వారు చాలా అలసిపోవుచుండడంచేత వారిలో యుద్ధం చేసే పటుత్వం సైతం తగ్గుతూవుంది. నేటి నాజీ సేనలు 1941 జూన్ 22 నాటి సేనలుమాత్రముకావు. సోవియట్లను జయించడం చాల సులభంగాను, త్వరగానూ జరుగుతుందని హిట్లరు ఆశ చూపుతూ వచ్చాడు. అందుకు ప్రత్యామ్నాయంగా నాజీసేనలు మున్నెన్నడూ యెరుగని విపరీత నష్టాలకు గురిగావలసివస్తుంది. దినములు గడిచినకొద్దీ యెఱ్ఱసైన్యం కొట్టే దెబ్బలు బలపడ్తున్నాయి. అందుచే నాజీ సేనలలో నిరుత్సాహం వ్యాపించి పోతూంది. "రష్యా యుద్ధం యెప్పుడు ముగుస్తుందా—" అన్న శబ్దం నాజీ సేనలలో మునుపటికన్నా యెక్కువగా వినిపించుతూంది. జర్మను సైనికుడు వ్రాసే వుత్తరంలో, తూర్పురంగంలో తాననుభవించే యమయాతనలను వర్ణించని వుత్తరంలేదు. రేమాండ్‌హీన్ అను జర్మను సైనికుడు 1941 అక్టోబరు 25 న తన భార్యకిలా వ్రాశాడు—"నేను ఫ్రాన్సులో పదేండ్లయినా పోరాడగలను గాని రష్యాలో ఒక యేడాది అయినా పోరాడడానికిష్టపడను." సైమన్ బామర్ అను జర్మను

సైనికుడు తన బంధువులకిలా వ్రాశాడు—"కొన్నివేల సైన్యాన్ని బలిస్తేనే మేము మాస్కోదిక్కుగా పురోగమనం చేయగల్గుతున్నాము. రష్యనులు భూతములవలె ప్రతిఘటిస్తున్నారు. ఇంతటి దనుకగల అనుభవంవల్లనే రష్యనులకంటే బలమైన సైన్యం మరొకటి లేదని మేము గ్రహించగల్గాము. ఇంకొక ఆరునెలలు గడిచిందా మనం సంపూర్ణంగా నాశనమవడం రూఢి."

యుద్ధారంభంనుండికూడా మనకు వూపిరిపీల్చుకోనైనా యెడమివ్వనని హిట్లరు బెదిరించాడు. శీతకాలంలోకూడా తన సేన కెదురులేదని ప్రగల్భాలు కొట్టాడు. మాస్కో పరిసరాలలోనూ, తదితర రంగాలలోనూ మనచేతి గట్టి దెబ్బలు చవిచూచిన పిమ్మట యీ నాజీ దురాశాపరులు యిప్పుడు తమ ప్రచారాన్ని మార్చివేశారు. ప్రస్తుతం చలికాలం ప్రవేశించింది గనుక క్రొత్త రక్షణ స్థానాలకు తమ సేనలు తిరోగమిస్తాయని ప్రకటించుకొంటున్నారు. మాస్కో ప్రాంగణంలోకి యీ నాజీలు చేరుకోవడంతో వారి ఓటమి ఆరంభమయిందనవచ్చు.

## ఎఱ్ఱసైన్యం కర్తవ్యం

మాస్కో సమీపంలో మనసైన్యం ప్రదర్శించిన అపూర్వ ధైర్యసాహసాలతో ఫాసిస్టు సైన్యం ఛిన్నా భిన్నమైంది. విపరీతంగా సైన్యాన్ని, ఆయుధ సామగ్రినీ, యితర పరికరాలనూ కోల్పోవడమే కాకుండా జర్మను సేనలలో నిరుత్సాహం ప్రబలిపోయింది. కాని జర్మనుసేనలు పూర్తిగా నాశనం గావించబడలేదు. జర్మనీ సైనిక యంత్రంతోటి మనం సాగించే యుద్ధంలో యెఱ్ఱసైన్యం, సోవియటు ప్రజలంకూడా యింతకంటె యెక్కువ కష్టనష్టాలకు లోనుగావలసివుంటుంది.

మన సైన్యం కొంత భూభాగాన్ని కోల్పోయిందన్నమాట

కూడా యదార్థమే కాని అలా తిరోగమనం చేసేటప్పుడు సైతం మన సైన్యం శత్రువుతో తీవ్రంగా పోరాడుతూ యెదురు దెబ్బలు కొడుతూనే వచ్చింది. మన పట్టణాలు కొన్నీ, పల్లెటూళ్ళు కొన్నీ కొంతవరకు శత్రుహస్తగత మవడంతో సోవియట్ ప్రజలు కొంత నష్టాలపాలయ్యారు. కాని పవిత్రమైన మన మాతృభూమిని నాజీ పశువులు ఆక్రమించినకొద్దీ శత్రువుపట్ల మనద్వేషం అధికమౌతూంది. శత్రువుయొక్క యినుప సంకెళ్ళనుండి మన జన్మభూమిని విముక్తి చేయవలెననే కాంక్ష దినదినాభి వృద్ధి చెందుతూంది.

పూర్వపు యుద్ధాలలోకూడ రష్యను సైన్యం అచ్చటచ్చట వెనుకంజవేయక తప్పిందికాదు. అయినా, అంతిమ విజయాన్ని సాధించింది. అంతర్యుద్ధకాలంలోకూడా మన యెఱ్ఱసైన్యం కొన్ని సమయాల్లో వెనుకంజవేసింది. 1918 లో జర్మను సామ్రాజ్యవాదుల సైన్యం యూక్రేనియన్ను ఆక్రమించుకొన్నప్పుడు మన పరిస్థితి చాలా విషమంగా వుండినది. అప్పుడు లెనిన్ యిలా అన్నాడు—"జాగ్రత్తగా ఆలోచించి మరి యుద్ధంచెయ్యండి. జర్మను సామ్రాజ్యవాదులు ఒక్క పర్యాయం యుద్ధాన్ని మనపై ప్రకటించారంటేమన బలాబలాలు, పారిశ్రామిక బలం యెలా వున్నాయో యోచించుకో వలసిన విధి మనది. యుద్ధకాలపు వేగంతో వీటి నన్నింటినీ అంచనా వేసుకోవాలి. ప్రస్తుత పరిస్థితిలో చెల్లాటం చాల ప్రమాదం. నరహంతకులు మనవాకిలియొద్ద పొంచున్నారు. ఏ నిమిషంలోనైనా మనం యీ విషయాన్ని మరువరాదు."

ఈ ధర్మయుద్ధంలో మన మంతా మన దేశభక్తిని ప్రదర్శించాలని కామ్రేడ్ స్టాలిన్ పదే పదే హెచ్చరించడంతో గోరిల్లా పోరాటాలను లేవదీయడమే కాకుండా మనయింళ్లనూ, వాకిండ్లనూ రక్షించుకొనేందుకు సోవియట్ ప్రజానీకమంతా ఒక్క మనిషిలా పోరాడవలెనని అతని అభిప్రాయం. జర్మను దురాక్రమణదారులను

యెదిరి మనం సాగించే యీ పోరాటంలో యెఱ్ఱసైనిక నాయకులూ, వారిని సర్వవిధాలా బలపరచే స్థానిక ప్రభుత్వ సంస్థలూ, తక్కిన సోవియట్ నాయకులూ—వీరే మంచి నిపుణులు. మన యెఱ్ఱసైన్యం, వారికి హృదయపూర్వకంగా సాయపడే మన యావత్ ప్రజానీకం కలిసి సాగించే సంయుక్తమైన పోరాటంద్వారా మాత్రమే శత్రు శిబిరంలో అసంతృప్తీ, అల్ల కల్లోలమూ కలుగుతవి. వీరోచిత ప్రజా ప్రతిఘటనవల్ల ఫాసిస్టులు అపారంగా నష్టపడి కొన్ని పట్ట ణాలను సైతం వదలి వెళ్ళారు. నాజీ సేనలు యేదినాని కాదినం బలహీన పడడంచేతనూ, క్రమేణా నైతిక పతనం చెందుచుండడం చేతనూ, మన ప్రజాప్రతి ఘటనకు మరింత బలం, హెచ్చు అవ కాశమూను గల్గుతవి.

గొప్ప సైనిక యంత్రంతో మనం పోరాడుచున్నామన్న విషయం మరువకండి. శత్రువు మనలను కొట్టే ప్రతిబలమైన దెబ్బ, మనం తిరోగమించేటప్పుడుకూడ యెఱ్ఱసైన్యంయొక్క పట్టుదలనూ, ప్రతిఘటనా శక్తినీ విజృంభింపచేస్తుందేకాని కొంచె పరచజాలదు. ఇదే అంతిమ విజయం మనదనడానికి తార్కాణం.

"యుద్ధం" అన్న పదంయొక్క ప్రాముఖ్యతను సరిగా గుర్తించండి. మన ఆప్త మిత్రులను, బంధువులను కోల్పోవడం, చాలా యిక్కట్లకు లోనవడం, మనమెంతగానో ప్రేమించే మన స్థిరనివాసాలను వదలి వెళ్ళడం మొదలగు నట్టి యుద్ధంవల్ల సంప్రాప్తించే దుస్సంఘటనలను మాత్రమే చూడకండి. ఏ విష యాన్నిగాని, చిత్రాన్ని చూచినట్లు, యిరువైపుల చూడాలి. మన కష్టా లను మాత్రమే గుర్తించడం చిత్రంయొక్క ఒకవైపుమాత్రమే చూడడమౌతుంది. కాని మరియొకవైపు మొక్కవోని ధైర్యంతో యీ క్రూర నాజీ పిశాచాలను మన సైన్యం కొట్టే ప్రతిబలమైన

దెబ్బ మన ప్రజలయొక్క భారాన్నీ, కష్టాలనూ తగ్గించివేస్తున్న దనికూడా గుర్తించాలి.

శత్రువు నెదిరించే సామర్థ్యం, సైనికబలం, యుద్ధనిపుణతా, వున్న ఆయుధ సామగ్రిని సరియగు పద్ధతులలో వుపయోగించు తెలివి తేటలూ మొదలగు విషయాలపైనే ఆధారపడి వుంటుంది. ఇరుపక్షాలవారికీ సైనికబలం దాదాపు సరిసమానంగావుంటే అప్పుడు ఆయుధసామగ్రి విజయాన్ని నిర్ణయిస్తుంది. కాబట్టి, యుద్ధంలో జయించాలంటే ముఖ్యంగా కావలసినవి ఆయుధాలూ, యితర సైనిక పరికరాలూ మాత్రమే. అందుచేత యీ యుద్ధంలో సైనిక పోరాటానికన్నా దేశం లోపలిభాగంనుంచి ఆయుధసామగ్రి, యితర పరికరాలూ సరఫరాచేసే సామర్థ్యమే యెక్కువ ప్రాముఖ్యతను పొందుతుంది.

మెరుపు యుద్ధం యిలా వుంటుంది—యుద్ధం ఆరంభం అయి, కాకమునుపే, మెరుపు వేగంతో విమానాలు శత్రు సరి హద్దులనున్న దుర్గశ్రేణులను బాంబులువేసి భీభత్సం చేస్తాయి. నేలమీదనుంచి టాంకులూ, మరఫిరంగులూ బయలుదేర్తాయి. సైన్యాలుకూడా అతి వేగంగా కదులుతుంటాయి. మెరుపు యుద్ధ విధానంలో సర్వ శక్తులనూ ఒకే పర్యాయం కేంద్రీకరించి శత్రువుపై దెబ్బకొట్టవలసివుంటుంది. దీర్ఘ యుద్ధానికి యెదిరినిమించిన యుద్ధ విధాన సిద్ధాంతము, యుద్ధ నిపుణులు, సంఖ్యాబలం అవసరం. వీటన్నింటినీ మించి సైనికావసరాలను సరఫరాచేసే సామర్థ్యం వుండాలి. అలాంటియుద్ధం శత్రువుయొక్క అంగ బలాన్నీ, నైతిక బలాన్నికూడా నీరసింప చేస్తుంది. సోవియట్ యూనియన్ను ఒక్క అదురుదెబ్బతో క్రుంగదీయాలని నాజీ నర హంతకులు ఆశించారు. దీనిలో వారు విఫలులయ్యారు. శత్రువు కొట్టిన మొదటిదెబ్బకు మనసైన్యం తట్టుకోలేక పోయినమాట

నిజమే. శత్రువును తన స్వస్థానానికి పంపలేకపోయిందికూడాను. కాని శత్రువుతో యెడతెగని పోరాటం సల్పడంలోనూ, తిరోగమనం చేసేటప్పుడు సైతం శత్రువుకు వ్యవధి యేమాత్రం యివ్వకుండా అతనిని విశేష నష్టాలకు గురిచెయ్యడంలోనూ మనసేన అజేయ మైందని రుజువు చేసుకుంది. జర్మను బందిపోటుదారులు యెన్ని అంచనాలువేసినా, తన్ను తాను రక్షించుకుంటూనే మన యెఱ్ఱ సైన్యం యెదిరిని ముప్పతిప్పలు పెట్టింది. జర్మను సైన్యాలకు యీ యుద్ధం యెప్పటితో అంతమయ్యేది అంతు చిక్కకుండా చేసింది.

ఈ దీర్ఘకాలయుద్ధం యెఱ్ఱసైన్యంమీద, సోవియటు ప్రజానీకంమీద అమిత భారాన్ని మోపిందని గ్రహించండి. కాని మన రక్షణలను మనం కాపాడుకుంటూ, మన సర్వశక్తులనూ గుమిగూర్చుచూ, మన మిత్రరాజ్యాలుయిచ్చు సహకారాన్ని పొందుచూ అంతిమ విజయాన్ని సాధించే అవకాశాన్నికూడా యీ యుద్ధం కలుగచేసింది.

జర్మనీలోని ప్రజాసామాన్యమందరూ యీ నాజీ దురాక్రమణాశయాలకు వ్యతిరేకులు. అందుచేత సామాన్య ప్రజలను సైతం సైన్యంలో చేర్చుకుంటే, సైన్యంలోనే విప్లవ విషబీజాలు యెక్కడ వెదజల్లుతారో అన్న భయంవల్ల హిట్లరు ప్రభుత్వం వారిని సైన్యంలో చేర్చుకోవడం లేదు. ముమ్మందు అవసరమైనప్పుడు వుపయోగించడానికని ప్రత్యేకింపబడ్డ జర్మను సైన్యాలకు సరియైన తరిఫీదు లేదు. ఫాసిస్టు ప్రచారకులచే తర్ఫీతు పొందని జర్మనుసైనికులు—ఫాసిస్టు సిద్ధాంతాలను తమ బుఱ్ఱలోకి యెక్కించుకోనివారు—నాజీ నాయకుల దురాక్రమణ ఆశయాలచే ఆకర్షింపబడడంలేదు.

యుద్ధం పొడిగింపబడడం జర్మను ప్రజలకు గొప్ప దెబ్బ. గత రెండేండ్ల పోరాటంలో హిట్లరు దాచియుంచుకొన్న సర్వసా

మగ్రి ఖర్చయిపోయింది. ఆక్రమిత దేశాల ప్రజను అమితంగా దోచుకుంటున్నాడు—హిట్లరు. ఈ విధంగా లూటీలద్వారా సంపాదించిన దాంట్లో కొంతభాగం సైనికులు తమ కుటుంబాలకు పంపుతున్నారు. ఎంత దోపిడీ చేసినప్పటికీ జర్మను ప్రజలస్థితి యినుమంతైనా బాగుపడక పోవడమే కాకుండా వారి దరిద్రం పెరుగుతూనే వుంది. కాని యీ నాజీ దొంగలు జర్మను ప్రజలను వుద్ధరించామంటూ ప్రగల్భాలు కొట్టుకుంటున్నారు.

మనపై దాడి జరిగిన మొదటి దశలో సైతం జర్మను ప్రజలకు రష్యా రంగంలో చనిపోయిన సైనికుల జాబితా తప్ప వేరేమీ దక్కలేదు. ఇంతదనుకా హిట్లరు ప్రోగుచేసివుంచినవీ, యీ మధ్య కొల్లగొట్టినవీ అంతా ఖర్చయిపోయాయి. ప్రతివారమూ జర్మనీ ప్రజలనుండి యెక్కువ ఆహార పదార్థాలనూ, యుద్ధసామగ్రినీ రష్యా రంగమునకు పంపించవలసివస్తూంది. తూర్పు రంగంలోని యింత పెద్ద జర్మనుసేనను మేపడంతో, ఆయుధాలు దుస్తులు సప్లయిచేయడంతో జర్మను ప్రజలు యమయాతన ననుభవిస్తున్నారు. ఎల్లప్పుడూ లూటీలవల్లనే జర్మనుసైన్యం జీవించగల్గుతుందని చెప్పడం మూర్ఖత్వమే అవుతుంది. ఎన్నికుతంత్రాలు పన్నినా, ఎన్నో మోసపు మాటలు చెప్పినా, తుదకు జర్మను ప్రజలనుండి వారి ఆఖరు రొట్టెనుకూడ హిట్లరు లాక్కోవలసిందే. తుదకు జర్మను ప్రజలు మండుటెండల్లో, యెండు బొమికెలతో బయటబడ్తారు. దీర్ఘకాల యుద్ధమంటే యిదే. ఫాసిజానికి ఓటమి ఖాయమని చెప్పడానికింకేమి కావాలి?

ఎన్నడుగాని విజయం దానంతటదే సిద్ధించదు. ప్రజాశక్తులన్నీ గుమిగూడి యెడతెగని పోరాటంద్వారా కృషిచేస్తేనే విజయం సిద్ధిస్తుంది.

## ప్రజలకు — సైన్యానికి ఐక్యత

యుద్ధకాలంలో మన ప్రజలు యెంతటి త్యాగానికైనా సిద్ధపడి యుండాలి. శత్రువుతో పోరాటం సల్పుతూన్న దళాలకూ, నూత నంగా తరిఫీదును పొందుచున్న దళాలకూ గూడా యుద్ధసామగ్రి అపారంగా అందుతుండాలి. విధి, విరామంలేని యీ యుద్ధంలో బోలెడంత యుద్ధసామగ్రి హరించిపోతుంటుంది. అందుచేత ఆయుధ కర్మాగారాలలోనూ, మందు సామగ్రి తయారుచేయుట లోనూ నిమగ్నులైయున్న మన సోదరులపై యెంతో బాధ్యతవుంది. వీరంతా దేశంపట్ల, యెఱ్ఱసైన్యంపట్ల, తమభక్తి విశ్వాసాలను ప్రద ర్శించుకోవాలి. ఈ విషయంలో అశ్రద్ధచేసినవారు తమ జన్మ భూమికి తీరని ద్రోహం చేసినవారవుతారు. అట్టివారు తమకు తెలియకుండానే శత్రువుకు వుపయోగపడ్తుంటారు.

దేశభక్తిని బాగా అర్థంచేసుకున్న ప్రతి కార్మికుడూ విశ్రాంతి లేమిని, తాత్కాలికాలైన యిబ్బందులను యెంతమాత్రం లక్ష్యం చేయడు. మంచి సరకునూ, అధికోత్పత్తినీ, యెలా సాగించుదా మన్నదే నేడు ప్రతి యువతీ యువకుని కలవరపెడ్తున్నది. యుద్ధ రంగం చాలా రకాల దుస్తులనూ, ఆరోగ్యమూ పరిశుభ్రతా పెంపొం దింప నవసరమైన పనిముట్లనూ, బీడీ సిగరెట్లు మొదలగు వస్తువు లనూ ఖర్చుచేస్తుంటుంది. ఎఱ్ఱసైన్యానికి పై వస్తువులు విరివిగా అందించబడ్తున్నాయని మనమెవరం చెప్పలేం. నాజీ ఆక్రమిత ప్రదేశంలోవున్న కర్మాగారాలనుండి మనకు వుత్పత్తి స్తంభించి పోయింది గనుక మిగిలిన కర్మాగారాలలో ఆ వస్తువులు తప్పని సరిగా యెన్నోరెట్లు యెక్కువగా వుత్పత్తి చేయబడాలి.

ఇదేవిధంగా సమిష్ఠి వ్యవసాయక్షేత్రాలలో పనిచేసే రైతుల పైనా, ఇతర ప్రభుత్వోద్యోగులపైనా చాలా బాధ్యత పడింది.

యుద్ధాలకు ఆహారపు దినుసులే అత్యావశ్యకాలు. మన రైతులంతా యీ విషయాన్ని బాగా అర్థంచేసుకోవాలి. "సాధ్యమైనంతవరకు" అనే వాదము యెచ్చట వినబడకూడదు. శాంతి సమయంలోవలె యికముందు కాలక్షేపానికీ, కబుర్లకూ తావుండరాదు. పంటల పెంపుదలే యుద్ధ విజయాన్ని నిర్ణయిస్తుందనే విషయం మరచిన వారు యెంతమాత్రమూ క్షమార్హులుకారు.

బలమైన శత్రువుతో మనసైన్యం పోరాడుతోంది. శత్రువును తమ వీరోచిత ప్రతిఘటనలద్వారా మనసైన్యాలు చావు దెబ్బలు కొడ్తున్నాయి. నేడు సోవియట్ రైతులుకూడా ఒకరంగంలో యుద్ధం చేస్తున్నామని భావించండి. ఈ రంగం మనదేశంలోపలి భాగంలో వుందనుకోండి. మీచేతులలో తుపాకులు, పిస్తోళ్ళు, మరఫిరంగులు లేకపోయినా, వ్యవసాయంచేసే పనిముట్లే ఆయుధాలనుకోండి. ముందురంగంలో యుద్ధంచేసే శ్రేణి, వెనుకభాగంలో పంటలు పండించే శ్రేణికూడా సోవియటు ప్రభుత్వంపట్ల తమ భక్తివిశ్వాసాలను చాటవలసిన తరుణం ఆసన్నమైంది. ప్రతివ్యవసాయక్షేత్రాధ్యక్షుడూ, ప్రతి సైనికనాయకుడుకూడా అంచనా ప్రకారం షరత్తులు లేకుండా పనిచేయండి. సోవియటు రైతులు ప్రతి ఒక్క కండరాన్ని పంటను అధికం చేయడానికే వుపయోగించి కష్టించండి. నాజీ ఆక్రమిత రష్యానుండి ఖాళీచేసివచ్చిన రైతాంగంకూడ యిప్పుడు తామున్న సమిష్టి వ్యవసాయక్షేత్రాలలో తమ శక్తినంతా ధారవోసి వుత్పత్తిని అధికం చేయండి. నేడు సోమరిపోతుల కెచ్చటా తావులేదు. ఒక్క సైన్యంతోనే విజయం సిద్ధించదనీ, స్త్రీ, పురుషులందరి సాముదాయక కృషి పైనకూడా విజయం సమానంగా ఆధారపడి వుందనీ ప్రతిరైతూ గుర్తించాలి. మన ధర్మయుద్ధంలో—యీ ప్రజా యుద్ధంలో మనదేశభక్తిని ప్రదర్శించడమంటే యిదే.

క్యూబిషేవ్ ప్రాంతంలో ఒక వ్యవసాయిక్షేత్రంలోని పశువుల శాలలో జరుగుతూన్న పనినిగురించి, 1941 నవంబరు 22 న "వాల్గా కమ్యూన్" అనే పత్రికలో యీ క్రిందివార్త ప్రకటితమైంది. ఈ క్రింది వుత్తరం ఆ పత్రికా సంపాదకులకు పంపబడింది—"ఇదివరకు మాపశువుల శాలలలో పాలు పితికేందుకై ఆర్గురుస్త్రీలు పనిచేసేవారు. ఇప్పుడు ముగ్గురమే ఆ పనినంతా చేస్తున్నాము. పందుల పాకలో ఒక్కస్త్రీ మాత్రం పనిచేస్తూంది. గొడ్లపెంపకంలో భార్యా భర్తలిద్దరు మాత్రమే పనిచేస్తున్నారు. రాత్రింబవళ్ళు సైతము వీరిద్దరూ కాపలా గాయడం, పశువులను మేపడం మొదలైన పనులు చేస్తున్నారు. మనమంతా అసహ్యించుకొనే శత్రువు నోడించడానికి, యెఱ్ఱసైన్యాని కుపయోగకరమైన యెంతటి కష్టాలకూ, త్యాగాలకూకూడా మేము జంకము."

ప్రతి దేశభక్తుడూ తన విధిని నిర్వర్తించడంలో అలాంటి త్యాగాన్నే చూపాలి.

మన ప్రభుత్వంయొక్క, కామ్రేడ్ స్టాలిన్‌యొక్క ఆదేశానుసారం యీ క్రూర నాజీ పశువులను నిర్మూలించడంలో సోవియటు ప్రజలు వివిధ కర్మాగారాల్లోనూ, రాకపోకల సదుపాయాల్లోనూ, వ్యవసాయ క్షేత్రాల్లోనూకూడా యెఱ్ఱసైన్యానికి హృదయపూర్వకమైన సంపూర్ణ సహకారం చేద్దామనే ఆశతో బండచాకిరీ చేస్తున్నారు.

యుద్ధం ప్రారంభమయింది లగాయతు జాతీయరక్షణ నిధికి సోవియట్ ప్రజలంతా ఐచ్ఛికంగా ధనసాహాయ్యం చేశారు. 1941 నవంబరు మొదటితేదీకి ఈ నిధికి రొక్కం రూ. 150,00,00,000 లు, ఋణపత్రాలద్వారా రూ. 210,00,00,000 లు వసూలైంది. దేశభక్తులైన పౌరులు చాలామంది ప్లాటినం, వెండీ, బంగారం,

నగలుకూడా యీ నిధికి అర్పించారు. సోవియటు ప్రజల సాటిలేని దేశభక్తిని ప్రదర్శించే ఒక వుదాహరణా న్నిచ్చట యివ్వకుండా వుండజాలను. మారీ ప్రాంతంలో టక్తబజార్ జిల్లాలోని ఒక యెఱ్ఱసైన్యపు సమిష్టి వ్యవసాయక్షేత్రంలోని స్త్రీలు దేశరక్షణకుగాను 7,544 తులముల యెత్తుగల బంగారపు పూత బూయబడిన వెండి ఆభరణాలు వసూలుచేసి పంపారు. ఇంతటి విలువకలిగిన ఆభరణాలను వసూలుచేయడంలో కొద్ది నిర్బంధం అయినా ప్రయోగింపబడి వుంటుందని ఆ జిల్లా ఆధికారులు అనుమానించారు. ఆ ప్రజాస్వామ్యం అధికారుల ఆజ్ఞానుసారం తుర్క్మన్ సోవియట్ ప్రజాస్వామ్య సుప్రసిద్ధ అధికారసంఘానికి అధ్యక్షుడైన ఏ. బి. బర్డియేవ్ నిజానిజాలు తెలుసుకొనేందుకు యీ సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి వెళ్ళాడు. అతడు పూర్తి విచారణచేయగా అచ్చట వసూలైన ఆభరణాలన్నీ బలవంతంలేకుండా యిచ్ఛాపూర్వకంగా యీయబడినవని రుజువైంది. ఆతని విచారణప్పుడు ఆ సమిష్టి వ్యవసాయక్షేత్రంలోని స్త్రీలు అతనితో యిలా అన్నారు—"మీరు శత్రువును నాశనం చేయండి. మేము యింతకంటె హెచ్చు ఆభరణాలిస్తూంటాము."

ఇదేకాదు. పల్లెలు, పట్టణాలు అనే విచక్షణలేకుండా సోవియటు ప్రజలు యెఱ్ఱసైన్యానికి యెన్నో వస్తువులు బహూమతిగా పంపారు. 1941 సెప్టెంబరునుండి నవంబరు ఆఖరుకు కార్మికకర్షకులూ, కొద్దిపాటి వుద్యోగస్థులూ, తదితరులూ యెఱ్ఱసైన్యానికి యీ దిగువ వస్తువులను పంపారు—

11,74,972 జతల పాదరక్షలు.

22,138 మఱుగుల ఉన్ని.

5,23,107 చొక్కాలు.

**20,62,706** తోలు చొక్కాలు.

**22,45,115** వున్ని చేతులమేజోళ్ళు.

**22,97,638** జతల వున్ని మేజోళ్ళు.

**14,29,048** పొట్టి లాగులు.

**13,33,360** టోపీలు.

**12,93,818** లాగులు.

ఇంకా యెన్నో పంపారు.

ఎఱ్ఱసైన్యంపట్ల సోవియటు ప్రజలకు గల గాఢాభిమానం, వారి అప్రతిహతమైన దేశభక్తి యిందుతోనే వెల్లడౌతూంది.

---

# 5. నాజీ దుండగీండ్లను పాతిపెట్టండి

సోవియటు ప్రజల మధ్యగల గాఢైక్యతా, మృత్యువును సహితం ధిక్కరించే వారిసాహసం, వారు చేస్తున్న త్యాగం మొదలైన వాటికి ప్రధానకారణం లెనిన్, స్టాలిన్ల గొప్ప ఆదర్శాలు మాత్రమే. మహానాయకులైన లెనిన్, స్టాలిన్ల విజయపతాకంక్రింద, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన సోవియటు ప్రభుత్వం నిర్మించబడి నందున దిగ్విజయంగా పాతికేండ్లు మన ప్రజలు శాంతినీ, కొదువ లేని సౌఖ్యాన్నీ అనుభవించారు. అటువంటి మహా పతాకం అడుగు జాడలలోనే నాజీ దురాక్రమణదారులతో మనం పోరాడుతున్నాము. ఆ పతాకం నీడనే మనకు విజయం లభిస్తుందని చాటుతున్నాం.

మన ప్రభుత్వాశయాలకు వ్యతిరేకంగా, వీరులైన సోవియటు ప్రజల ఆశయాలకు విరుద్ధంగా రక్తపాతంతో కూడిన యీ యుద్ధం

మనపై బలవంతంగా రుద్దపడింది. ప్రపంచంలోకల్లా బలీయమైన సైన్యంతోటి, సోవియటు ప్రజలకు నీచమైన శత్రువుతోటి, ప్రపంచ పటంలోంచి స్లావు జాతిని, అంతకంటె మిన్నగా మన రష్యను జాతిని తుడిచివేయాలని జర్మను ఫాసిజం తాను పుట్టినది లగాయితూ ప్రయత్నిస్తూన్న దానితో మన మీ యుద్ధాన్ని చేస్తున్నాము.

జర్మను నాజీ దురాక్రమణ దారులు మనపై బలవంతంగా మోపిన యీ యుద్ధంలో అప్పుడే వారి గొంతెమ్మ కోరికలు విచ్ఛిన్నమై పోతున్నాయి. కనుక మనమింకా యెక్కువ త్యాగాలు చేద్దాము. ఇంతకంటె కడుంగడు గట్టిదైన ప్రతిఘటనా దుర్గాన్ని సృష్టించుదాము. శత్రువును సర్వనాశనం చేదాము. మన జన్మ భూమిపై ఒక్క నాజీ పశువైన లేకుండా చేద్దాము. ఇదే మన మహా నాయకుడైన స్టాలిన్ ఆజ్ఞ. సోవియటు ప్రజలందరియొక్క మహాదాశయంకూడా యిదే.

విజయ పతాకం చేబూని దురాక్రమణ దారులను పాతి పెట్టుదాము.

హిట్లరుకు సమాధి.

## 22-6-42 న కాలినిన్ యిచ్చిన రేడియో వుపన్యాసం — యిది.

నాజీ జర్మనీ సోవియటు యూనియన్‌పై దురాక్రమణ దాడి జరిపిందని నేటికి సరిగా యేడాదిక్రితం సోవియటు ప్రజలు, ప్రపంచ ప్రజలుకూడా రేడియోలో విన్నారు. ఒక యేడాదిపాటు రక్తపు యేరులు ప్రవహించాయి. ఈ యేడాది యుద్ధము, నాజీ దురాక్రమణ దారుల అంచనాలు కాగితాలపైనే యింకిపోతాయని రుజువు చేసింది.

వారి కట్టకడపటి అంచనాల ప్రకారం అయినా సోవియటు యూనియన్ మూడు నాలుగు మాసాలలోనో, కనీసం సీతాకాల ప్రవేశంలోపునో నాజీ పాదాక్రాంతమై యుండవలసిందే. యుద్ధం ప్రారంభమైన తొలి దినాల్లో జర్మనులు చాలా వడిగా ముందుకు చొచ్చుక వచ్చారు. తమ విజయాలను ప్రపంచమంతటా బ్రహ్మాండంగా చాటుకొన్నారు. ఈ సందర్భంలో లియోటాల్‌స్టాయి కథలలో ఒక చిన్నకథ జ్ఞప్తికివస్తూవుంది. ఆ కథలో ఒకడు కొంత మొత్తండబ్బుకు సూర్యోదయం మొదలు సూర్యాస్తమయం వరకూ పరుగెత్తుతూ యెంత ప్రదేశాన్నిచుట్టి రాగల్గుతాడో అంత భూమిని పొందగలడు అని విని అతడు తన శక్తికిమించి తిరుగుముఖం లేకుండా పరుగిడ నారంభించాడు. తుదకు పరుగిడ నారంభించిన చోటికే రాగల్గాడు. కాని వచ్చీ రాకముందే చచ్చి వూరుకున్నాడు. ఆరడుగులు మాత్రమే అతని సమాధికి కావలసి వచ్చింది.

అలాగే హిట్లరు విచ్ఛిన్నమవుతూన్న తన సైన్యానికి కొంత భూమిని యివ్వగల్గాడు. కాని కొన్ని లక్షల జర్మను సైనికుల గోరీలు సోవియటు భూమిలో నిర్మింపబడ్డాయి.

## సాటిలేని ప్రతిఘటన

కామ్రేడ్ స్టాలిన్ పిలుపుకు ప్రత్యుత్తరంగా సోవియటు ప్రజలంతా నడుములు బిగించి శత్రువుకు అపార నష్టాలను ఆపాదించుతున్నారు. మన యెఱ్ఱసైన్యం కొంత ప్రదేశాన్ని విడిచి రావలసి వచ్చినప్పుడు రైల్వే కార్మికులు తమ యింజనులనూ, వాగన్లనూ కూడా వారితోపాటు తీసుకవచ్చేశారు. ఫాక్టరీ కార్మికులు తాము పనిచేసే యంత్రాలనన్నిటినీ సులక్షణ స్థానాలకు చేర్చేశారు. వ్యవసాయ క్షేత్రాల్లోని రైతులు తమ పశువులను, మరనాగళ్ళను, ధాన్యాన్ని భద్రంగా యివతలికి తీసుకవచ్చారు. తీసుకొనిరాను వీలు

లేని వస్తువులనెల్ల మంటగల్పేశారు. ఆయుధాన్ని చేబూనేవయస్సు వచ్చిన ప్రతి యువతీ, యువకుడూ గెరిల్లా దళాల్లో చేరారు. ధగధగ మండుతూన్న సోవియటు భూమిపై మాత్రమే యీ ఫాసిస్టులు తమ పాదాలను నింపవలసి వస్తూంది.

1941 నవంబరు 6 న మాస్కో సోవియట్లో వుపన్యసిస్తూ కామ్రేడ్ స్టాలిన్ యిలా అన్నాడు—"విజయం సాధించడానికి సోవియటు ప్రజలంతా యెఱ్ఱసైన్యాన్నీ, యెఱ్ఱ నౌకాదళాన్నీ, యెఱ్ఱ విమాన దళాన్నీ హృదయపూర్వకంగా బలపరచాలి. మన శ్రామికులు, వుద్యోగస్థులు, స్త్రీ పురుషులంతా ఫాక్టరీలో విధివిరామం లేకుండా పనిచేసి యింకా యెక్కువ టాంకులను, టాంకు దళాలను ధ్వంసంచేసే ఫిరంగులను, విమానాలను, మరఫిరంగులను, తుపాకులను తదితర మారణపు మందు సామానులను తయారుచేయాలి. అలాగే స్త్రీ పురుష విచక్షణ లేకుండా రైతులంతాకూడా విశ్రాంతి లీసుకోకుండా పనిచేస్తూ యెక్కువ గోధుమలను, ముడిపదార్థాలను, మాంసాన్ని తయారుచేసి యిస్తుండాలి. జర్మను మూకలను సమూలంగా హతమార్చాలంటే, మనదేశంయొక్క స్వాతంత్ర్యాన్నీ, గౌరవ మర్యాదలనూ నిలబెట్టాలంటే సోవియటు ప్రజలందరూ యెఱ్ఱసైన్యంతో చేతులు కలిపి ఒక్కమనిషిలా పోరాడుతూ యీ స్వాతంత్ర యుద్ధాన్ని సాగించాలి."

## ఎఱ్ఱసైన్యానిదే పైచెయ్యి

కామ్రేడ్ స్టాలిన్ వుపన్యాసం విన్నప్పటినుండీ మన ఎఱ్ఱసైన్యమే అన్నివిధాలా చొరవతీసుకుంటూవుంది. మాస్కోను స్వాధీనపరచుకొనవలెననే ఆశ యీ నాజీ దురాక్రమణదారుల నింకా పీడించుతున్నప్పటికీ యెఱ్ఱసైన్యం రోస్టావ్, టిక్విన్ దగ్గరనూ, మాస్కో పరిసరాల్లోనూ జర్మను సైన్యాలను కొట్టిన బల

మైన దెబ్బలు హిట్లరు బందిపోటుల దాడిని మూలచ్ఛేదం చేసాయి. విపరీతంగా జర్మను సేనల కళేబరాలను సోవియటు భూమిలో పాతిపెడ్తూన్నాము. టోలెడు ఆయుధ సామగ్రిని కోల్పోతూ, విజయమిక మనదికాదనే నిస్పృహతో జర్మను సేనలు వెనుకకు దొర్లిపోతున్నాయి. మన అజేయమైన యెఱ్ఱసైన్యం యెదురుదాడులు సాగిస్తూ నాజీ పశువులను మనభూమిమీద లేకుండా శుభ్రపరుచుతూంది. "

1942 లోనే జర్మను ఫాసిస్టు సైన్యాలను తుదముట్టించాలనీ, నాజీ యినుప పాదాలనుండి పవిత్రమైన మన మాతృభూమిని విముక్తి చేయాలనీ కామ్రేడ్ స్టాలిన్ తన మేడే ఆర్డరులో యెఱ్ఱసైన్యాన్ని హెచ్చరించాడు—"దీన్ని సాధించడానికి మన యెఱ్ఱసైన్యానికి అన్ని సౌకర్యాలూ యేర్పడి వున్నాయి. మన మాతృభూమి మనకు సమకూర్చే పదార్థ సామగ్రినంతటినీ, శత్రువుకు వ్యతిరేకంగా, పూర్తిగా వుపయోగించుకొనే సామర్థ్యంకావాలి. ఎఱ్ఱసైన్యం, కాల్బలం, మరఫిరంగిదళం, టాంకులూ, వైమానిక దళాలూ, గుఱ్ఱపు దళాలూ— అన్నీకూడా సైనిక వ్యూహాలను, నిపుణతను గురించి బాగా తెలుసుకోవాలి. మంచి అనుభవంగడించి తమ ఆయుధాల నుపయోగించుటలో నిపుణులు కావాలి. ఎవరి పనులలో వారు వుత్తీర్ణులు కావాలి. ఈవిధంగా మాత్రమే శత్రువు సులభంగా ఓడించ బడ్తాడు."

నేటి జర్మనుసైన్యం మొదటిరోజుల్లోవలె 1500 మైళ్ళ పొడవునా పోరాడే స్థితిలో లేదు. అప్పటికి యిప్పటికి జర్మను సేనలో చాలా భేదంవుంది. శారీరకంగాను, నైతికంగానుకూడా జర్మనుసేన చాల బలహీనపడింది. కొన్ని కొన్ని రంగాలలో తీవ్ర యుద్ధాలు చేయవచ్చుగాని అందుకు తగిన ముడుపుకూడా చెల్లించవలసి వుంటుంది.

మిరుమిట్లుగొల్పే కొద్దికొద్ది విజయాలతో తన మిత్రులను మోసగించాలని హిట్లరు తాపత్రయ పడుతున్నాడు. రష్యా రంగం నుండి ఫిన్నులూ, రుమేనియన్, ఇటలీసేనలూ వెనుకకు మరల్ప బడితే జర్మను సేనలకు వురిబోసినట్లవుతుంది. జర్మనీకి యీ మిత్ర రాజ్యాలు ఆహారపదార్థాలు, ముడిపదార్థాలు సరఫరాచేసి పెట్టేం దుకే కాక యుద్ధరంగంలో తమ తమ సైన్యాలను పంపి జర్మనీ కొరకు పోరాడేందుకుకూడా చాలా అవుసరమైనవి. నేటి జర్మను సైన్యం 1941 నాటిది గాదు.

నాజీ ఆశయా లింతవరకూ యీడేరనందుననూ, యుద్ధం దీర్ఘకాల యుద్ధంగా మారిన కారణంచేతనూ, తాము దురాక్రమణ చేస్తున్నామని నాజీ సేనలు అవగాహన చేసుకోడంవల్లనూ, నాజీ సైన్యం నైతికంగా పతనం జెందుతూంది. ఇదే నాజీసైనికులను క్రమేణా యుద్ధవ్యతిరేకులుగా మారుస్తూంది.

## ఆక్రమిత దేశాలలోని ప్రమాదం

నాజీ క్రూర పరిపాలన మంచిదంటూ ఆక్రమిత యూరపు లోని ఆర్థిక సంపదంతా కొల్లగొట్టబడ్తూంది. జర్మనులు అమానుష మైన చర్యలను జరుపుతున్నారు. కాని వారి ఆటలు సోవియటు యూనియన్‌లో సాగడంలేదు. ఎఱ్ఱసైన్యం ఫాసిస్టు మూకలను చిదగగొడ్తూంది. ఇదంతా నాజీ ఆక్రమిత యూరపులోని దేశభక్తు లైన గొరిల్లాల పోరాటాలకు ప్రోత్సాహమిస్తుంది. యూరపంతా అగ్నిపర్వతంలావుంది. తత్కారణంగా ఫాసిస్టులు పోలీసు దుండ గాల నింకా అధికం చేస్తూ, దేశభక్తుల క్రోధాన్ని రెట్టింపచే స్తున్నారు.

జర్మనులు ఆక్రమించిన సోవియటు దేశంలో గొరిల్లా పోరా టాలు నానాటికి తీవ్రతరమవుతున్నాయి. కొంత నాజీసైన్యం

యీ గొరిల్లాలతోనే పోరాడవలసి వస్తూన్నది. అక్కడక్కడ గొరిల్లాలచేతులలోనుండి కొన్ని గ్రామాలను లాక్కొని అవ్వే పెద్ద ఘనకార్యాలుగా నాజీలు యెంచుకుంటున్నారు. కాని గొరిల్లాదళాల వల్ల తమ కెలాంటి కొత్తదెబ్బలు తగుల్తున్నాయో, గొరిల్లా బాధలు పడలేక యెన్ని కుగ్రామాలను జర్మనులు విడిచిపోవలసి వస్తుందో మాత్రం తెలియనీయడంలేదు. జర్మనులు వెనుకభాగంలోని రష్యా ఒక అగ్నిగుండంగావుంది. ముందు నూయి, వెనుక గొయ్యిగా వుంది నాజీసేనల పని. యుద్ధం తీవ్రతరమయ్యేకొద్దీ, యుద్ధం మరి యొకనెల పొడిగించబడేకొద్దీ, గొరిల్లాలచేత జర్మను సేనలు ప్రయాణము చేయుచున్న రైలుబండ్లు యెక్కువ విచ్ఛిన్నపరచబడుచున్నవి. నాజీల యుద్ధసామగ్రి అపరిమితంగా నాశనంచేయబడ్తూంది. ప్రతిదినమూ కొన్నికొన్ని జర్మనుదళాలే హతమవుతున్నాయి.

## ఎఱ్ఱసైన్య స్థైర్యం

ఎఱ్ఱసైన్యం, సోవియటు ప్రజలనైతిక బలంకూడా క్రమాభివృద్ధి చెందుతూంది. ప్రతి యెఱ్ఱసైనికుడూ, తానొక మహదాశయం కొరకై పోరాడుతున్నానని, మాతృభూమియొక్క గౌరవ ప్రతిష్ఠలను కాపాడేందుకే పోరాడుతున్నానని గ్రహించాడు. అందుచేతనే అతను యుద్ధరంగంలో రెట్టింపు బలంతో నాజీ రక్కసులకు మన భూమిలో తావులేకుండా చేస్తున్నాడు. నిన్నటికంటె నేడు, నేటికంటె రేపు మన పారిశ్రామికోత్పత్తి అధికమవుతూంటుంది. యుద్ధ పరిస్థితులలో స్థాయిలో మన వుత్పత్తి యింకా మెరుగుచెందుతూంటుంది కూడాను. యుద్ధ మారంభమయి యిప్పటి కొకయేడాది గడచిననూ యెఱ్ఱసైన్యాని కందించబడే యుద్ధపరికరాలు నానాటికి యేమాత్రం తగ్గలేదు సరేకదా అధికమవుతూనే వున్నాయి. మన

సోవియటు భూమినంతా యుద్ధమేఘాలు ఆవరించి యున్నప్పటికీ మునుపటికంటే నేడే వ్యవసాయభూమి విస్తీర్ణం యెక్కువైంది. యుద్ధంవల్ల తమపైబడిన భారాన్ని మన కర్షకులు హృదయపూర్వకంగా, సంతోషంతో మోస్తున్నారని మనం సగర్వంగా చెప్పుకోవచ్చు.

## మన ఆర్థికపు పునాది గట్టిది

మన ఆర్థిక విధానమంతా చాల బలమైన పునాదులపై నిర్మింపబడిందని గడచిన యేడాది యుద్ధమే నిరూపించింది. మన ప్రజల స్థైర్యం చాల గొప్పది. నాజీ శత్రువును మన ప్రజలు అసహ్యించుకొనేలా మరెవ్వరూ అసహ్యించుకోరు. ఈ ఫాసిస్టు పిశాచాన్ని నిర్దాక్షిణ్యంగా హతమార్చాలని మన ప్రజలు నిశ్చయించుకొన్నారు.

అంతర్జాతీయ రంగంలోకూడా మనం చాల బలవంతులుగానున్నాము. రష్యా—జర్మనీ యుద్ధం తొలిదినాలలోకూడా బ్రిటను అమెరికాలు మనలను ప్రోత్సహిస్తూనే వున్నాయి. జర్మనీకి వ్యతిరేకంగా మొన్ననే ఆంగ్లో—సోవియటు ఒడంబడికకూడా ఒకటి జరిగింది. మనకూ అమెరికాకూ పరస్పర సహాయపు టొడంబడిక కుదిరింది. బ్రిటను, అమెరికాలు మన కపారసాయం చేస్తున్నాయి. ఈ నాజీ పశువులతోటి యుద్ధంలో విజయం దానంతట అదే సిద్ధిస్తుందని సోవియటు ప్రజలు భ్రమించడంలేదు. శత్రు వింకా బలంగానే వున్నాడు. అతడింకా ఓడింపబడలేదు. శత్రువును చిదుగగొట్టడమే మనవంతు.

## మనదే విజయం

హిట్లరుకు ఓటమిఖాయం. సోవియటు ప్రజలకు తాము జయించి తీరుదుమని తెలుసు. కాని విజయం యుద్ధరంగంలో

మాత్రమే కాక దేశంలోనూ, ఫాక్టరీలలోనూ, గనులలోనూ, సమిష్టి వ్యవసాయక్షేత్రాలలోనూ, గొరిల్లా పోరాటాలలోనూ మిళితమై యున్నదని మనకు తెలుసు. శత్రువును నిర్మూలించడంలో మన ప్రజ లెంతటి త్యాగాలకైనా, కష్టాలకైనాకూడా జంకరు. మొక్క వోని ధైర్యంతో ప్రజలందరూ ముందుకు సాగిరండి.





*Printed for the Cultural Book Club, Vangal Buildings, Perambur, Madras by Vinodan Press, 33, Jones Street, MADRAS. G. T.*——PRAJA YUDDHAM

58

# సంస్కృతి గ్రంథమండలి

## పెరంబూరు

మా ప్రచురణలు—

| | | | |
|---|---|---|---|
| 3. నేటి జపాన్ | 0 | 8 | 0 |
| 4. సోవియట్ రష్యా | 0 | 12 | 0 |
| 5. చైనాలో నూతన జీవితోద్యమం | 0 | 4 | 0 |
| 6. బోల్షివిజం | 0 | 4 | 0 |
| 7. పాకిస్థాన్ | 0 | 4 | 0 |
| 8. సోవియట్ సంయుక్తరాష్ట్రం— మన మిత్రరాజ్యం | 0 | 8 | 0 |
| 9. ప్రపంచ ఆర్థికదుస్థితి | 0 | 4 | 0 |
| 10. సోవియట్లదేశం (రెండవ భాగం) | 0 | 10 | 0 |
| 11. నేటి చైనా | 0 | 10 | 0 |

## మావద్ద దొరకు యితర ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| 1. వాత్స్యాయన కామసూత్రాలు | 8 | 0 | 0 |
| 2. గౌతమ ధర్మసూత్రాలు | 3 | 8 | 0 |
| 3. రాజశేఖర కావ్య మీమాంస | 2 | 8 | 0 |

